# ఉత్తరాలు

## కథలు

దీపావళి సంచికలోని కథలు ఏమంత బాగాలేదు సెలక్షన్ నచ్చలేదు. సీరియల్స్ 'ఆడది' 'జీవనరాగం' ముందు ముందు చాలా బాగుండునని తలంచు చున్నాను.

ఎన్. నరసింహారావు, (తిరుమల).

* * *

దీపావళి కథల పోటీలో రెండవ బహుమతిపొందిన శ్రీమొక్కపాటి శివాజీగారి 'చెయ్యను గాక చెయ్యను' తెలుగువారికి పూర్తిగా కొత్తతరహా కథన. అందించారు. రచయిత హాస్యం, కరుణ, ప్రేమ తెగింపు లాంటిఅన్ని రసాలను సమభాగాలలో నింపి కథకు ఎంతోమేలు చేకూర్చారు.

వి. వి. స్వామి, (కరీంనగర్)

* *

దీపావళి కథల పోటీలో ప్రథమ, ద్వితీయ తృతీయ బహుమతులు పొందిన కథలు చాల బాగు న్నాయి— శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్యగారికి, శ్రీమొక్కపాటి శివాజీగారికి, కుమారిభట్టిప్రోలుబాలా దేవిగారికి నా అభినందనలు.

బి. పి. కరుణాకర్ (న్యూవా—11).

## దీపావళి సంచిక

దీపావళి సంచిక అన్నికోణాలనుండీ పాఠకులను ఆనందపర్చింది. బహుమతి పొందిన మూడుకథలు బాగున్నాయి. ముఖ్యంగా ప్రథమ బహుమతి పొందిన పెద్దిభొట్ల సుబ్బరామయ్యగారి "ముసురు" కథలో వేమురాలిటీని కన్నులకు గట్టినట్లుగా చిత్రించబడినది. రచయితకు మా అభినందనలు.

భానుమతి రామకృష్ణగారి "అత్తగారూ—జిలేబీ ఘులూ" హుషారుగా యుంది. విమ్మైన రచయిత్రి తమ అత్తగారి ద్వారా మాకు చాలా వినోదాన్ని కల్గించారు.

కంద్రేగుల వెంకటనాగేశ్వరరావు,
బిళ్ళపాటి సూర్యప్రకాశరావు,
వెంకసాంబశివరావు.
(అనకాపల్లి)

* * *

దీపావళి సంచిక సర్వాంగసుందరంగా వెలువడింది. ముఖచిత్రం నరకాసురవధ చాల బాగున్నది. చిత్రకారులు శేషగిరిరావుకు హృదయపూర్వక అభినందనములు.

బహుమతి కథలలో "ముసురు", "లేవు లేదు......" బాగున్నవి.

నానాటికి దిగజారుతున్నమన తెలుగుచిత్రనిర్మాతలకు 34వ పేజీలోని జయదేవ్‌గారి కార్టూన్‌పెద్ద దెబ్బ. దీనిని చూసైనా మన తెలుగు నిర్మాతల నుండి మంచి చిత్రాలు రాగలవని ఆశిద్దాం.

టి. కె. వంతసం, (తిరుపతి).

తప్పక

చూడండి!

విదేశీయులను అనుకరిస్తూ
తప్పుదోవ పాలౌపడి —
ముప్పుతెచ్చుకున్న సమాజానికి
కొత్త వెలుగు చూపించు
చిత్రమే



వాసూ స్టూడియోస్ వారి

కథ: డా. నిహార్ రంజన్ గుప్త
మాటలు: డి.వి. నరసరాజు
పాటలు: డా. సి. నారాయణరెడ్డి
సంగీతం: ఘంటసాల

దర్శకత్వం
దాదామిరాసీ

విజయ రిలీజ్

VIJAYA

# ఉత్తరాలు

## సీరియల్

ఆద్యంతమూ ఆసక్తికరంగా ఉంది, క్రొత్త పంథాలో సాగి, నిజానికి చేరువలోనున్న నవల ''మట్టిబొమ్మలు''. ఈమధ్య వచ్చిన నవలల్లో కెల్లా ఆణిముత్యం లాంటిది.

ఇందులోని ఒక్కొక్క పాత్ర ఒక బలహీనతకు రూపం. నవలలోని సంఘటనలు సహజంగా ఈ బలహీనతల చుట్టూ అల్లుకొని పోయాయి. సునిషిలో కేవలం సామర్థ్యమూ, నిబ్బరమూ మాత్రమే ఉంటే, అతనిజీవితం ఒక తెలుగు సినిమాలా తయారవుతుందిగాని, అందులో నిజమైన కథకు చోటుండదు. ఏకాంబరం - శివరామయ్య, అచ్చమ్మగార్లని కూడా పాఠకుడు ద్వేషించడానికి వీలులేకుండా జరిగింది పాత్రపోషణ. కొన్ని సమయాల్లో వారు సంకుచితంగా ప్రవర్తించవచ్చు. కాని వాళ్లందరూ మామూలు మనుష్యుల్లా ప్రవర్తించేరు.

''జీవిస్తున్న పాత్రలతో'' నవలారచన చేయగల బహుకొద్దిమంది రచయితలలో శ్రీ తాడిగిరి పోతరాజు గారు ఒకరనియూ, ఆయన కలంనుండి తెలుగునవలా జానికి ప్రతిబింబములవంటి రచనలు ఇంకా వెలువడగలవనియూ, ఈనవల నిరూపించుచున్నది.

సుబ్బారావు, (పూనా).





# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 1-12-'67
ప్లవంగనామ సం|| కార్తిక మాసం అమావాస్య
సంపుటము : 60 సంచిక : 13

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
4, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |

## విషయానుక్రమణిక


కాంగ్రెస అధ్యక్ష పదవి:
నందాకి శ్రీమతి గాంధి
మద్దతు


నేనామెని ప్రధానమంత్రిగా
చేశాను ఆమెనాకెంత పని
చేసింది!


రాజీకి సిద్ధం
అవసరమైతే
తగాదాకి కూడా....
రాజులు


మన
ప్రజాస్వామ్యం
లో లజ్జాకర
మైన
విషయం
వేలం
యమ్మెల్యేలు, యంపీలు ఎక్కువ
పాడిన వాళ్ళకి
అమ్మబడతారు!

# అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నిక
# శ్రీమతిగాంధీ నందాని బలపర్చడంలో తెరవెనుక చరిత్ర

అందరి కాంగ్రెసు వ్యక్తులలాగానే లాలా గుల్జారీలాల్‌నందా కూడా అధికారం లేకుండా వుండలేరు. గుడ్డికన్నుకంటె మెల్లకన్ను మంచిదికదా, అని ఆయన తెలుసుకున్నారు. శ్రీమతి గాంధీ భారతదేశానికి ప్రధానమంత్రి. కామరాజుగారు ఓడిపోయిన కాంగ్రెసు నాయకుడు 'అస్తమిస్తున్న సూర్యుడి' లాంటివాడు. లాలా గుల్జారీలాల్‌నందా పంజాబీ. శల్య సారథ్యంలో అందెవేసిన చెయ్యి. భారత యుద్ధంలో కర్ణుడికి శల్యుడెంతగా ఉపయోగించాడో కాంగ్రెసుకి ఈయనా అంతే. అసలు పంజాబీవారే అంత!

సంయుక్త పంజాబుకి ఉదయసూర్యుడు గుర్తు. కామరాజుగారు అస్తమిస్తున్న సూర్యుడు గనుక, ఆయనకి లాలాజీగారి ఉపయోగం లేదు!

ఇక్కడ, శ్రీమతి గాంధీ ప్రధాని అయిన మొట్టమొదటి సందర్భాన్ని చెప్పుకోవడం చాలా అవసరం. శ్రీమతి గాంధీ కామరాజుగారి అభ్యర్థి. బహిరంగంగా మొరార్జీ దేశాయ్‌గారు ఓడిపోవడానికి కారణం అదే. మంత్రివర్గాన్ని ఏర్పరచుకుంటున్నప్పుడు ఆమె లాలా గుల్జారీలాల్ నందా గారిని, బాబూ జగ్‌జీవన్‌రామ్ గార్ని చేర్చుకోవడానికి ఇష్టపడలేదు. అలాంటి పరిస్థితిలో లాలా గుల్జారీలాల్‌జీ రెండుసార్లు స్పృహ తప్పారు. చికిత్సకోసం డా యువ్ యవ్ సింగ్‌గారు కామరాజుగారి దగ్గరికి పరుగెత్తారు. శ్రీమతి గాంధీ లాలాగార్ని మంత్రివర్గంలోకి చేర్చుకోవడం తప్పనూ లేదు, దేశీయాంగశాఖ ఇవ్వకా తప్పలేదు. ఆ అధికారంతో లాలాజీ గోసంరక్షణోద్యమాన్ని లేవదీసి ఢిల్లీలో కుమ్ములాటకి దోపిడీలకి కారకులయ్యారు. పోలీసులకి 'ట్రేడ్‌యూనియన్' కావాలనే ఉద్యమాన్ని కూడా ఆయన బలపరిచారు, అంతే. ఆ తర్వాతేమయింది? లాలాగార్ని మంత్రివర్గంలో నుంచి గెంటి, చేతులు దులుపుకున్నారు. అప్పటినుంచి ప్రధానమంత్రికి లాలాజీకి మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటున్నది.

## రాజీపడిన లాలాజీ

మాజీ దేశీయాంగ మంత్రిగారి విధాన మేషాలు లెక్కించి గ్రహాలు వక్రించాయని స్వంత జ్యోతిష పండితుడు హనేరీరావ్ గారే ఆయనకి దూరంగా ఉండజొచ్చారు. ముందు వెనుక లాలోచించి లాలాజీ చిన్న కిటుకు వేశారు. శ్రీమతి గాంధీతో రాజీపడడం వంటికి మంచిదని ఆయన అభిప్రాయపడ్డారు. అది అక్షరాలా కార్యరూపంలోకి వచ్చింది. మొట్టమొదటి ఛాన్సుగా బెంగాలులో కాంగ్రెసును చక్కబరచడానికి వెళ్లారు. అక్కడ గొప్ప కృషిచేసి, బెంగాల్ కాంగ్రెసు కమిటీ బర్తరఫును తెలియపరిచారు. ఆ తర్వాత, ఇంతవరకు లేని గందరగోళం లేచింది. కందిరీగల తుట్టెంతా లేచి దేశాన్ని పొడవడం మొదలెట్టింది. మరో విధంగా చెప్పాలంటే లాలా గుల్జారీలాల్ నందా ఆయన చేయవలసిన దానిలో కృతార్థుడు కాలేకపోయారు.

హర్యానా ప్రాంతంనుంచి ఆయన పార్లమెంటులో కాలుపెట్టారు. హర్యానా భారతదేశంమీద ఒక సరికొత్త ప్రజాస్వామ్యాన్ని రుద్దజూస్తున్నది. అమ్మగా మిగిలిన వాళ్లుగా హర్యానా మనుషులు తయారయ్యారు. ప్రభుత్వ కోశాగారం బీగాలు ముఖ్యమంత్రి దగ్గరున్నాయి. మనుషుల్ని వేలంపాటవేస్తే ఎక్కువకు పాడగల శక్తి అతని కొక్కడికే వుంటుంది!

## టిక్కెట్టుముక్క దొరకలేదు?

అహ్మదాబాదు లాలా గుల్జారీలాల్‌నందాని కార్మిక నాయకుణ్ని చేసింది. లాలాజీ పదవీకాలం మొదటిరోజుల్లో, పార్లమెంటులో ఆయన అడుగు పెట్టడానికి గుజరాత్ సహాయంచేసింది. అక్కడ ఆయన ఆడిన నాటకాన్ని అందరూ గుర్తించారు. అందుకే, క్రిందటి ఎన్నికల్లో ఆ ప్రాంతంనుంచి టిక్కెట్టుముక్క దొరక్కుండా పోయింది!

నెహ్రూగారు శ్రీమతి గాంధీని ప్రధానిగా చెయ్యడానికి దువ్వుతున్నప్పుడు లాలాజీ పండిట్ నెహ్రూ ఎక్కువకాలం జీవించాలని ఒక పెద్ద పూజ ఏర్పాటు చేశారు. పూజకోసం బీహారునుంచి పండితులు రావింపబడ్డారు. ఇది అలా వుండగా లాలాజీమీద శ్రీమతి గాంధీకి కోపం రావడానికి మరో కారణంకూడా వుంది. లాల్‌బహదూర్‌శాస్త్రి మరణం తర్వాత, వచ్చే సార్వత్రిక ఎన్నికల వరకూ లాలాజీ ప్రధానమంత్రి అవుదామనుకున్నారు.

## కామరాజు ఎందుకు తప్పుకున్నారు?

పైన చెప్పిన ఉదంతమంతా ఇక్కడ అవసరం. ఎందుకంటే, ఇప్పుడు కాంగ్రెసు అధ్యక్ష పదవికి లాలాజీ ప్రధానమంత్రి తరపున అభ్యర్థి! ఈ శ్రీవారు అడ్డుతగలకపోతే కామరాజుగారు మరికొన్నాళ్లపాటు కాంగ్రెసు అధ్యక్షపదవిని స్వీకరించి వుండేవారే! కామరాజుగారు ఎంతో ఉదారస్వభావులు, విశ్వాసంకల వ్యక్తి. అందుకే, శ్రీమతి గాంధీ సార్వత్రిక ఎన్నికలకు ముందూ వెనకా కూడా ప్రధాని కాగలిగారు. లాలాజీగారే గనక కంటిన్యూ అయినట్టయితే శ్రీమతి గాంధీ ఎన్నటికీ ప్రధాని అయేవారుకాదు.

మూడుసార్లు తాత్కాలికంగా ప్రధాని పదవిలో వున్నందుకుగాను లాలాజీ తమ హక్కును సంరక్షించుకునేవారు! శాశ్వత ప్రధాన మంత్రిగా తనకు తప్పితే మరొకరెవరికీ అధికారం లేదని గట్టిగా పట్టుబట్టి వుండేవారు. ఇటువంటి విషయాలు శ్రీమతి గాంధీని చిరెత్తించినమాట వాస్తవం. భేదాభిప్రాయాలు రావడానికి ఇదే కారణం. లాలాజీ తత్వం బాగా తెలుసును గనక మొట్టమొదట ఆయన్ని మంత్రివర్గంలోకి తీసుకోవటానికి శ్రీమతి గాంధీ వెనకాడారు.

లాలాజీ దేశీయాంగమంత్రి పదవిని నిర్వహించడానికి దోహదం చేసినవారు కామరాజు లాలాజీ ఇప్పుడు కామరాజుగారికి ప్రత్యర్థి వర్గంలో చేరిపోయారు!

## ప్రభుత్వం ఉత్తరాదివారి హక్కు!

ఇప్పుడు కాంగ్రెసు అధ్యక్ష పదవి కోసం కాసుకుని కూర్చున్నవాళ్లు ముఖ్యంగా ఇద్దరు. మొదటివారు లాలా గుల్జారీలాల్ నందా, రెండవవారు యస్. కె. పాటిల్. పండిట్ కె. డి. మాలవియాగారు మూడో నంబరులో చేరదామని ఆరాటపడుతున్నారు.

ఇక్కడ మరో రెండు విషయాల్ని గుర్తించాలి. రాష్ట్రపతి ఉత్తరాదివారు. ప్రధాని ఉత్తరాదివారు. ఇప్పుడు నడుస్తున్న చరిత్రని ఆధారం చేసుకుంటే కాంగ్రెసు నాయకత్వం కూడా ఉత్తరాదికే చెందేట్టుగా వుంది!

## విజ్ఞుల మధ్య అజ్ఞులు

ప్రధానమంత్రి ఈమధ్య గవర్నర్ల సమావేశంలో ఒక మహత్తరమైన ఉపన్యాసం ఇచ్చారు అందులో విషయం ఎవరినీ కదిలించలేకపోయింది భవిష్యత్తులో ఎటువంటి అభ్యుదయాన్నీ సూచించలేదు. ఆమె ప్రధాన మంత్రి అయినప్పటినుంచి పల్లిస్తున్న పాటాన్నే మళ్ళీ చెప్పారు. ఇదివరకు పాడిందాన్నే మళ్ళీ పాడారు.

గవర్నర్లలో చాలామంది రాజకీయాల్లో ఢక్కామొక్కీలు తిన్నవాళ్లు, ప్రజలకు అకుంఠిత సేవచేసినవాళ్ళు, దేశం బాగోగుల్ని దృష్టిలో వుంచుకొన్నవాళ్లు ఉన్నారు. వీరంతా విజ్ఞానంతో తల నెరిసిన వ్యక్తులు వారిమధ్య శ్రీమతి గాంధీ దేశంలో సమస్యల గూర్చి ఉపన్యసించారు. ఆర్థిక రాజకీయ పరిస్థితులగూర్చి ఉగ్గడించారు. పంచవర్ష విద్యారంగాల ప్రగతినిగురించి కొల్లగుద్ది చెప్పారు. ఈ సమస్యలు ఇతరదేశాల్లో కూడా వున్నాయన్నారు. ఆయా దేశాల్లో కూడా భాషా సమస్యలు, ప్రాంతీయ సమస్యలు, విద్యార్థుల అల్లర్లు వున్నాయన్నారు, 'ఈ సమస్యల్ని మనం ధైర్యంతో ఎదుర్కోవాలి. వాటికి చోటివ్వకూడదు' అని వక్కాణించారు.

## పాత రికార్డుకి కొత్త గ్రామఫోను

ఎన్నికలకి ముందు కూడా శ్రీమతి గాంధీ ఇదేవిధంగా చెప్పారు కార్మిక, విద్యార్థి, ప్రజల అల్లర్లు ఎన్నికలకు, ముందు సహజమే నన్నారు! ఆమె మాటకి అమెరికా వ్యవహారాల్ని జోడుపెడుతూ పత్రికలు రాశాయి. 'రికార్డు' ఒక్కటే. కాని గ్రామఫోను మాత్రం కొత్తది! ఆర్థిక పరిస్థితి చక్కబడడం గురించి ఈ విషయాలు మళ్లీ చెప్పబడుతున్నాయి. పారిశ్రామిక అభివృద్ధికి కరువు అడ్డురాలేదు. ముఖ్యంగా రాజకీయ పరమైన విచ్ఛిత్తి ఇందుకు [illegible] ప్రభుత్వం పరిపాలన వ్యవస్థలో ఓడిపోయింది. కరువును ఎదుర్కోగలిగామూ అంటే అందుకు కారణం పాశ్చాత్యదేశాలు డబ్బునీ, మనుష్యుల్నీ ఈ ప్రాంతాలలో కురిపించాయి. జయప్రకాష్ నారాయణ్ అన్నట్లుగా క్రిస్టవ మిషనరీలు ఈ పుణ్యం కట్టుకున్నారు. కాలిఫోర్నియా నుంచి రోమ్‌వరకు అనేకమంది వచ్చి కరువు ప్రాంతాల ప్రజలకి సేవచేశారు. వారి విషయంలో శ్రీమతి గాంధీ ఒక్క ముక్క కూడా చెప్పలేదు. సేవ పేరుతో బీహార్ ప్రజల్ని క్రైస్తవులుగా మార్చేస్తున్నారన్న అధిక్షేపణ మాత్రం వుంది ఈ విధంగా మన కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాం. 1972లోపులో విదేశ మిషనరీ సంస్థల్ని రూపుమాపాలని శ్రీమతి గాంధీ ప్రభుత్వం నాంధిస్తున్నది. రాజకీయ శక్తుల రంగాల్లో

(12 వ పేజీ చూడండి)

# క్రికెట్ కింగ్ సి. కె. నాయుడు

క్రికెట్ రంగంలో నీరాజనాలు అందుకొని 'విజార్డ్'గా పేరు పొందిన కల్నల్ సి. కె. నాయుడు తమ 72 వ ఏట ఇండోర్‌లో నవంబర్ 14 వ తేదీన కాలధర్మం చెందారు. క్రికెట్ కింగ్‌గా పేరు పొందిన శ్రీ కొఠారి కనకయ్యనాయుడు తమ ఏడవ ఏటనే క్రికెట్ ఆడటం మొదలు పెట్టారు. భారత క్రికెట్ చరిత్రలో దాదాపు నలభై సంవత్సరాలకుపైగా ప్రముఖ స్థానం వహించిన ఆయన ఆటలో ఆల్ రౌండర్. భారతప్రభుత్వం పద్మభూషణ్ బిరుదంతో ఆయన్ని సత్కరించింది.

శ్రీ నాయుడు బ్రిటన్‌లో పర్యటించిన మొట్టమొదటి అఖిలభారత జట్టుకు నాయకత్వం వహించారు. విస్‌డెన్‌లో క్రికెటర్స్ ఆఫ్ ది ఇయర్ అని అయిదుగురి పేర్లు వేసేవారు ఆ జాబితాలోకి ఎక్కిన మొట్టమొదటి భారతీయుడు శ్రీ సి. కె. నాయుడు

క్రికెట్ ఆటలోనే కాకుండా ఫుట్‌బాల్, హాకీ, టెన్నిస్, టేబుల్ టెన్నిస్ తుపాకి షూటింగ్, వేట, బిలియార్డ్స్, స్నూకర్, మల్ల విద్యలలోకూడా శ్రీ నాయుడు ప్రావీణ్యం పొందారు.

శ్రీ నాయుడు మరణవార్త విన్న ప్రధాని శ్రీమతి గాంధీ 'నిజమైన క్రీడాకారుని భారతదేశం కోల్పోయింది' అని తమ సందేశంలో



జోహారులు అర్పించారు. 'సి. కె. నాయుడు మరణం ప్రపంచ క్రికెట్ క్రీడాకారులు అందరికీ తీరనిలోటు కలిగించింది' అని భారత క్రికెట్‌బోర్డ్ అధ్యక్షుడు శ్రీ ఇరాని ఒక ప్రకటనలో వెల్లడించారు.










నాకు తెలివి వచ్చేసరికి రాళ్ళ కింద ఉన్నాను. నా కుడిచెయ్యి ఆదింపబడలేనట్టు తెలుసుకున్నాను.

అతికష్టం మీద దుర్భరమయిన బరువుని కొంత తొలగించాను.

గాలి తగలటంతో గాలా కోలుకుంది.







గుట్టకు దగ్గరగా ఉండటంచేత తప్పించుకున్నాము. కూలిన భాగం చాలా మట్టుకు మాకూ, సముద్రానికీ మధ్య పడింది.

నీటి అంచున పడుకుని అలలలో స్నానం చెయ్యటం కన్నా మరేమీ వీలుకాలేదు మాకు. అంత బలహీనంగా ఉన్నాము.

"మన మీదకి ఆ గుట్ట అంచుని తోశారెవరో! అర్థమయిందనుకుంటాను నీకు గాలా.." కొండ కూలిన చోటు దగ్గిరే మా బట్టలు ఉన్నాయి.










"అవును గాలా! ఆ కూలటం ప్రమాదవశాత్తు జరగలేదు. ఎవరో మందు పెట్టి పేల్చారు. సరిగ్గా అది పడేముందు పేలుడు శబ్దం విన్నాను! పక్షులు కూడా విన్నాయి. అందుకనే నీ మీద పడ్డాను.." [illegible]

"నాకు సంతోషంగా ఉంది."
"ఇప్పుడు ఏమిటి?"

"ఇది క్రెబ్స్‌తో ముగిసేదికాదు. ఇదంతా చక్కగా ఏర్పాటు చేసిన కుట్ర! మనల్ని కనిపెడుతూనే ఉన్నారు, గాలా! మనల్ని చంపాలని వారి ఉద్దేశ్యం. [illegible]"










కొండ కూలిన చోటుని చుట్టి వెళ్ళాము. అక్కడ మేము చనిపోయినంత పనయింది..

"రాకెట్ స్థావరం జర్మన్లు మనల్నెందుకు చంపాలనుకుంటున్నారో తెలుసుకోవాలి— శుక్రవారం ముందు!"

'ఏమయినా సరే తెలుసుకోవాలి ... ఈ రాకెట్ తో ఒక సంవత్సరం గడిపాను. అది పేలితే నేను భరించలేను!"

సముద్రం పోటు మన అవశేషాలు కొట్టుకు పోతాయని మన స్నేహితులు అనుకుంటూ ఉంటారు. వాళ్ళు చక్కగా ఆశ్చర్యపడేట్లు చేద్దాము.."







డయినింగ్ గదిలోకి వస్తూ, మాకు ఎటువంటి స్వాగతం వస్తుందా అనుకున్నాను..

మా రాక పెద్ద సంచలనం అని తెలిసిపోయింది
"అచ్ సో! డీ ఇంగ్లాండర్!"










''అరె, భలేవాడివి! నీ గురించే ఆదుర్దా పడుతున్నాను. ఒక గార్డు కొండ కూలిందని చెప్పాడు. మీ కోసం మనుష్యుల్ని పంపి వెతికిద్దామనుకుంటున్నాను.' 'సర్ హ్యూగో' అందరి కన్నా ముందుగా కోలుకున్నాడు.

''సారీ! సర్ హ్యూగో— అలా చాలా దూరం నడిచి వెళ్ళాము. సముద్రపు అలల వల్ల ఇవతలికి రాలేకపోయాము. కొండ కూలటం ఏమిటి?''

అబద్ధపు తక్షణ ఫలితం— (క్రెబ్స్) మూర్ఛ పోయాడు.

(ఇంకావుంది)

డిసెంబర్ 18-వ తేదీ

# విద్యావినోదం

[illegible] ఎకనామిక్ కాన్ఫరెన్స్ జూబిలీ సెషన్సు జరుగుతున్న రోజుల్లో—పది, పద కొండు, పన్నెండు తేదీలలో మద్రాసు విశ్వ విద్యాలయం సెంటినరీ ఆడిటోరియంలో నాటకాలూ, వినోదాలు జరిగాయి.

ఒక రకంగా యివి నిజమైన వినోద ప్రదర్శనలే! మద్రాసు జనానికి యితర ప్రాంతాల వాళ్లకికూడా యీ వినోదం పాకింది ఎటొచ్చీ.

ఒకరోజున 'ద్రోణ' నాటకం వేస్తుండగా ప్రేక్షకులు ఆనందంతో ఈలలు కూతలూ, ... అరుపులూ, కేరింతలూ పెట్టారట. ఆనందంపాలు ఎక్కువయ్యి ఆ నాటకం అపహాస్యం పాలయిందని, పబ్లిక్ వర్క్సు మంత్రి శ్రీ కరుణానిధి తన విచారాన్ని తెలియజేసి, ఆ నాడు సభ ముగింపుచేశారని ఓ కర్ణా కర్ణి వార్త.

మరోరోజున ఒక విద్యార్థి స్టేజి మీద ఒక హిందీపాట పాడేసరికి జనం గోల చేసి, హిందీపాట పాడ వీల్లేదనీ, పాడిన మేరకు క్షమాపణ తెలియజేయాలనీ వినా దాలు చేయడమేగాక, స్టేజిఎక్కి అడి గారట. పాట పాడిన విద్యార్థి ససేమిరా అంటే అతని తరఫున ఒక ఆర్గనైజరు క్షమాపణ తెలియజేసుకున్నారట — ఇది మరో వార్త.



[illegible] శ్రీ [illegible], అతని భార్య [illegible]

ఇంకోరోజున ఒక సంగీత విద్వాంసుడు (శ్రీ సిర్కాళి గోవిందరాజన్ అన్నారు) పాటలు పాడుతుండగా శ్రోతలు తమ కిష్టమైన పాటపేరులు కాగితాలమీద రాసి విసిరారట. అవి గురి తప్పి, లేక లక్ష్యం తెలిసో పక్కనున్న విద్యార్థినులమీద పడ్డా యనీ, అవిగాక కొన్ని కాగితం ఏరోలు కూడా వారిమీద పడ్డాయనీ అన్నారు. అది చూసి, తోటి విద్యార్థులను ఒక విద్యార్థి మందలించాడట. 'మీరు కావాలనే ఆడపిల్లల మీద విసురుతున్నారు' అన్నాడట ఆవిద్యార్థి. వేసిన విద్యార్థులు పచ్చయప్ప కాలేజీకి చెందినవారనీ, యీ ముక్క అన్న విద్యార్థి వివేకానంద కాలేజికి చెందినవాడనీ కొందరు అన్నారు. నువ్వెంతంటే నువ్వెంతనుకోడం అయిపోయింది.

మూడోనాడు (ఆదివారం) పరశురామన్ అనే వివేకానంద విద్యార్థిని పచ్చయప్పకాలేజీ విద్యార్థులు యూనివర్సిటీ ఆడిటోరియంలోనే తరిమి తరిమి కొట్టారని, అతను ప్రాణ భీతితో హాలంతా పరుగులు పెట్టేసరికి మిత్రులు కొంతమంది అతన్నో కారులోకి ఎక్కించారట. ఆ కారు బయల్దేరేలోగా అవతలివాళ్లు రాళ్లేసి కొట్టారట. మళ్ళీ ఆ పరశురామనే కారు దిగి హాస్టల్కి పారి పోయాడట. ఈలోగా కొంతమంది పోలీసు రిపోర్టు యిస్తే, వాళ్లొచ్చి పరిస్థితిని అదుపు లోకి తెచ్చారనీ మద్రాసులో అంతా అను కుంటున్నారు—అంటున్నారు.

ఈ విషయం 'రౌడీజం' అనే శీర్షిక క్రింద 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' 14 తేదీన రాసింది. దాంతో పచ్చయప్ప కాలేజీ విద్యా ర్థులు ఆ ఆఫీసుమీద దాడిచేసి తమ ఆక్షేపణను తెలిపారనీ, ఆలోగా మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ అన్నాదురై వచ్చి పరి స్థితులను శాంతపరచారనీ—ఇండియన్ ఎక్స్ ప్రెస్ 15 తేదీన వ్రాసింది.



దీర్ఘకాల మన్నికకు

# దావణగిరి

## డివిజి 99 లాంగ్ క్లాత్



దీర్ఘకాలం మన్నికకు, శ్రేష్ఠతకు ప్రసిద్ధమైనవి.
వివిధోపయోగాలకు, రోజువారీ వాడకానికి అనువైనవి.

**ది దావణగిరి కాటన్ మిల్స్ లిమిటెడ్**

దావణగెరె (మైసూర్ స్టేట్)

మేనేజింగ్ ఏజెంట్లు : ఆర్. హనుమంతప్ప అండ్ సన్స్,



# విద్యా వినోదం

పదహారున విద్యాశాఖామంత్రి శ్రీ నెడుంజెళియాన్ వివేకానంద విద్యార్థులను కలుసుకుని ప్రభుత్వం ఖర్చు విషయంలో వ్యయం చేకూరుస్తుందని హామీ యిచ్చారట. సమ్మెలో చాలా కాలేజీలు పాల్గొన్నాయి.

సమ్మె నాపి, వివేకానంద విద్యార్థులు క్లాసులకు హాజరవుతారేమో అనుకుంటున్నారు జనం.

ఇలాంటివి ప్రతీ కాలేజీల్లోనూ జరుగుతాయనీ, ఎటొచ్చీ యిది బయట జరిగిందనే విచారం తప్ప విషయం అంత విడ్డూరం కాదని ఓ కాలేజి ప్రిన్సిపాలుగారన్నారట.

అదీ నిజమే!!
ఇంతకీ విద్య అనగానేమి!!
విద్యాలయాలనగానేమి!!
విద్యార్థులనగా ఎవరు!!
ఏమో!!!

— ప్రాలాషడు

## సర్వాధిపై లేఖ

(7 వ పేజీ తరువాయి)

కుంటుపడుతున్న సౌభ్రాతృత్వాన్ని పునర్వ్యవస్థీకరించడానికి ఎటువంటి కృషి చేస్తున్నదీ శ్రీమతి గాంధీ చెప్పనేలేదు 'ప్రభుత్వం అస్థిరత్వానికి బందీ' అని వెంకొకసారి శ్రీమతి పండిట్‌గారన్నారు అత్తయ్యగారి మాటలకి మేనకోడలి ఆమె యోగ్యతా పత్రంగా తయారయింది!

భారత ప్రజాస్వామ్య విధానంలో పటిష్టతకి క్రిందటి ఎన్నికలు గొప్ప సాక్ష్యమని శ్రీమతి గాంధీ అన్నారు. హర్యానాలో ఏం జరుగుతున్నదో అది మరో దృష్టాంతం! అక్కడి ముఖ్యమంత్రి ప్రజాస్వామ్యంలో పట్టభద్రుడు! ఆయన పదవిని నిలద్రొక్కుకోడానికి సభ్యుల్ని నిమురుతున్నారు. బలం కూర్చుకుంటున్నారు. వారికి మంత్రి పదవులు బహూకరించి పన్నుకట్టే వారి డబ్బును సద్వినియోగం చేస్తున్నారు! ఇంతకంటే, బలమైన ప్రజాస్వామ్యానికి ఉదాహరణ ఎందుకు?

# టపాకాయలు-కొందరి అభిప్రాయాలు

[దీపావళి నాడేకాకుండా ఆ తర్వాత వచ్చే కార్తీక పౌర్ణమికి కూడా టపాకాయల మోత మద్రాసు నగరంలో వినవచ్చింది. టపాకాయలు ఈ సందర్భాలలోనే కాకుండా సంవత్సరంలో ఎన్నిసార్లు వివిధ సందర్భాల్లో సరదాగా కాల్చటం మనందరికీ తెలిసిందే. పెళ్ళిళ్ళు, ఊరేగింపుల సమయాల్లో కూడా ఆడంబరం కోసం టపాకాయలు విరివిగా కాలుస్తూ ఉంటారు. ఈ టపాకాయలపై మద్రాసు పౌరుల అభిప్రాయాలను దీపావళి సంచికలోనే వేద్దామనుకున్నాము కానీ కారణాంతరాల వల్ల సాధ్యపడలేదు.

—సం॥]

**శ్రీ ఎ.కె. ముత్తుస్వామిఅయ్యర్, టి.నగర్:**

దీపావళి అంటే దీపాలపండుగ. అయితే టపాకాయలు అవసరంలేని దీపావళి అంటూ ఉండదు. చిన్నపిల్లలు కొత్తబట్టలకంటే టపాకాయలు యిచ్చే ఆనందాన్ని అనుభవించడానికే పండుగ కోసం ఎదురు చూస్తారు. గత శతాబ్దంలో టపాకాయల రకాలలో చాలామార్పు వచ్చింది. పూర్వం చైనీస్ క్రాకర్స్‌కి ప్రాముఖ్యత ఉండేది. క్రమంగా వాటి స్థానాన్ని దేశంలోనే ఉత్పత్తి చేసినటపాకాయలు ఆక్రమించుకున్నాయి. శివకాశిలో తయారవుతున్న టపాకాయలు దేశం అల్లా ప్రసిద్ధిచెందటమే కాకుండా విదేశాలకు ఎగుమతి అవుతున్నాయి. టపాకాయల అల్లరి ఎంత చికాకెత్తించిన అది అందరికీ సాటిలేని ఆకర్షణ.

**శ్రీమతి దేవసేనాధామరత్నం పెరంబూరు:**

ఆరోజుల్లో టపాకాయల ధర తక్కువ, నాణ్యత ఎక్కువ. ప్రస్తుతం ధర ఎక్కువైనా నాణ్యతకు రెండవస్థానమే యివ్వాల్సివస్తోంది. కాని ప్రస్తుతం టపాకాయలలోని వైవిధ్యాన్ని మనం కాదనలేం, అవి చేసే ధ్వని మాత్రం మనకి సంతృప్తిని కలిగించలేదు. కాని మనదేశంలోనే తయారవుతున్నాయి కాబట్టి మనం గర్వపడాలి. నేను నా నలుగురు పిల్లలకు రు. 25 టపాకాయలు కొంటాను కానీ నాటితో వాళ్ళు తృప్తిపడరు. కాని ఏంచేసేది? అంతడబ్బుపెట్టి టపాకాయలు కొంటే అప్పుచ్చులు ఎక్కడ్నించి వస్తాయి? కాని టపాకాయలు లేకుండా దీపావళి చేసుకోలేంకదా!

**శ్రీమతి టి రాజామ్మాళ్ (సైకిల్ రిక్షా తొక్కేవాని భార్య) ట్రిప్లికేన్:**

ఆకాలంలో మాయింటాయన ఏ రూపాయిపెట్టి టపాసులు తెచ్చేవాడు. అయితే దీపావళి వెళ్ళిపోయిన తరువాత కూడా కొన మిగిలిపోయేవి. ఇప్పుడు జూద్దామంటే రూపాయికి నలుగు కాకరొత్తులు పెట్టెలు కూడా రావటంలేదు. ఏంచేసేది. ఎంతోకష్టంమీద సతిపిడూ మూడు పాయిలకి పిల్లలకోసం టపాసులు కొంటాము. కానీ ఈ ఏడాదికి మాయింటాయన తతివమ్మాళరుసులన్నీ జాస్తి అయిన యివి ధరలు పెరిగిపోనాయని రెండు రూపాయలకే, కొనడానికి విరణయించేశాం.

**శ్రీ టి. రాజారావు వెస్ట్ మాంబళం:**

సంవత్సరానికొకసారి వచ్చే దీపావళి పిల్లలమొదలుకొని ముసలివాళ్లవరకూ సరదానిచ్చే పర్వదినం. టపాకాయలు కాల్చటంలో పిల్లలు ఏ ప్రత్యేకమైన ఆనందాన్ని అనుభవిస్తారు. యుద్ధానికి ముందునేను మా పిల్లలకోసం కరెంట్ టపాకాయలు కొన్నరోజుల్ని జ్ఞాపకం చేసుకోకుండా ఉండలేను. చైనాలో తయారైన అవి వెలువరించిన బ్రహ్మాండమైన ధ్వనియిప్పుడికీ నా చెవుల్లో గింగురు మంటూ ఉంటుంది. శబ్దంతో మన దేశంలో తయారైన టపాకాయల శబ్దం ఏమాత్రం సరితూగదు. అలాగని నాటినిదిగు



శ్రీ రాజారావు

మతి చేసుకోవాలని నా ఉద్దేశ్యంకాదు. మనవాటికో కూడనాణ్యత పెరగాలి తర్వాతవిదేశీ టపాకాయలపై మన మోజును వదిలించాలి. ఆరోజుల్లో ఎన్నోతీపి పదార్థాలను తయారు చేసేది గృహిణి. కానీ ప్రస్తుతం పప్పు, నెయ్యిధరలు పెరిగిపోవడంతో పంచదార కరువవడంతో అన్నిరకాలు చేసుకోడానికి అవకాశం కూడా లేదు.

**శ్రీ ఆర్. పార్థసారథి తాంబరం:**

రెండవప్రపంచ యుద్ధానంతరం దిగుమతులు నిషేధింపబడి దేశీయవస్తువులు బజారులోకిరావటం మొదలైంది. పూర్వం టపాకాయలు చాలా కొద్ది రకాలే ఉండేవి కానీ ప్రస్తుతం ఎన్నోరకాలుతయారు చేస్తున్నారు.

టపాకాయలు దీపావళి సందర్భంగానే కాకుండా మామూలు సంతోషసందర్భాలలోకూడా సరదాకి కాల్చటం ఎక్కువైంది. అందువల్ల పిల్లలు తమ తల్లిదండ్రులు కొత్తబట్టలు కొన్నా అంతగా తృప్తిపడరు. మధ్యతరగతి కుటుంబాలకి టపాకాయలు గగనకుసుమాలుగా కన్పిస్తున్నాయి. టపాకాయల ఫ్యాక్టరీలకు తరలించే రసాయనికవస్తువులను దేశరక్షణావసరాలకు యింకా బాగా సద్వినియోగం చేయవచ్చు.

**శ్రీ పెనుశిలరెడ్డి, పెరంబూరు:**

ఆనాటినుంచి దీపావళికి భారతావనిలో ప్రత్యేకత ఉంది. దీపావళినాడు టపాకాయలు కాల్చటం ఆబాలగోపాలానికి సరదా. ఆనాడు ప్రజలు నరకాసురుడు వధింపబడినందుకు సంతోషసూచకంగా "దీపావళి" జరుపుకున్నారు. ప్రస్తుతం ప్రజలను పీడించడంలో నరకాసునివిమించి పోయినదోషులను వదిలించుకోడానికి టపాకాయలను కాలుస్తున్నారు. దీనికి తగినట్టు, సంచిరకానికి చెందిన టపాకాయలు మనకుకావాలి. మామూలుప్రజలకి యివి అందుబాటులో లేకుండపోయినవి. ద్రవ్యోల్బణం మరింత దెబ్బతీసింది. మున్ముందయినా మన టపాకాయల నాణ్యత పెరిగి ధర అందుబాటులోకి వస్తుందని ఆశిద్దాం.

సేకరణ:

పి. వి. కె. మూర్తి.




# మైకోతియాన్ 20-E

మీ పొగాకు పంటకు శ్రీరామరక్ష



పొగాకు పంట మనదేశం ఆదాయానికి చాలా తోడ్పడుతోంది. ఆంధ్రదేశంలో పండే పొగాకు విదేశాలకు ఎగుమతి అయి మన పురోగమనానికి అవసరమైన విదేశ మారక ద్రవ్యాన్ని సంపాదించి పెడుతోంది.

ఈ విధంగా ప్రాముఖ్యం గల పొగాకు పంట క్రిమికీటకాదుల పాలబడకుండా చూడడం అతిముఖ్యం. మైకోతియాన్ 20-E దీనికి ఏకైక మార్గం. మైకో వారి క్రిమిసంహారక ఔషధాలు మీ పంటలకు శ్రీరామరక్ష.

మైకో క్రిమిసంహారక ఔషధాలు



మైసూరు ఇన్‌సెక్టిసైడ్స్ కంపెనీ (ఆంధ్ర)
పోస్టుబాక్స్ నెం. 546
గాంధీనగర్, విజయవాడ-3

MICO.11

## ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

**ఎమ్. ఎస్. ఆర్, గుంతకల్లు**

స్నేహితునితో వియ్యం అందితే ఎలా ఉంటుంది?

కుదిరితే వియ్యం లాగా లేకుంటే కయ్యం లాగా ఉంటుంది

**టి. వి. కె. విజయవాడ**

కుటుంబ నియంత్రణకై మాత్రలు వాడుట మంచిదేనా? ఏమైనా నష్టాలున్నాయా?

సొంత వైద్యం ఎందుకు? మీకు దగ్గరలో ఉన్న ఏ కుటుంబనియంత్రణా కేంద్రానికి వెళ్ళినా, వాళ్ళు మీకు సంతోషంగా సలహా యిస్తారు

**ఎస్. పి, జగిత్యాల**

కుటుంబ నియంత్రణమును పాటించడం ద్వారా దైవశాసనాన్ని మార్చవచ్చునా?

ఏ దైవ శాసనం మీరు చెప్పేది చెప్తారా?

**వి. వి, బరంపురం**

మానవులు ఒక పుష్పాన్ని గౌరవించి ఇంకో పుష్పాన్ని కించపరుస్తారెందుకు?

బాగుంది! తా మునిగింది గంగ తా వలచింది రంభ అన్న సామెత వినలేదా?

**బి. ఎల్, సిర్‌పూరు కాగజ్‌నగరు**

పత్రికలకి రచనలు పంపిన తరువాత అవి ప్రచురణార్హం అయినవీ కానివీ తెలుసుకొందుకు ఎంతకాలం వేచిఉండాలి?

పత్రికల ఆఫీసులో రద్దీనిబట్టి ఒకో సమయంలో రెండుమాసాలు కూడా దాటిపోవచ్చు!

**పి. పి. ఎస్, బొంబాయి**

రామలక్ష్మిగారూ. సినిమాలలో ఎప్పుడూ పవిత్ర భారత స్త్రీగురించే మాట్లాడుతారు చూపిస్తారు. పవిత్ర భారత పురుషుని గురించి మాటవరసకైనా అనరేం?

స్త్రీలకు ప్రత్యేకం అంటే అది పురుషులనే ఎక్కువగా ఆకర్షిస్తుంది అలాగే స్త్రీని పవిత్రత పేర బాధపెంటే ఏడిపిస్తే, ఆ సినిమాకి అంతగానూ డబ్బువస్తుంది మనలోమనమాట స్త్రీ లేకుండ పురుషుని ఔన్నత్యంగాని మరేదైనా గాని ఎలా గుర్తింపునకు వస్తుంది శాయిగారూ?

**కె. ఎస్. ఆర్, ఆదోని**

ఎంత కూడదనుకున్నా అప్పు చేయకుండా ఉండలేకున్నాను ఎంచేత?

అప్పుచేయడం అప్పటికి ప్రశాంతంగా ఉండడంచేత!

**పి. ఆర్. కె, రాజమండ్రి**

అప్పుతీసుకుని అడిగితే తిట్టేవాళ్ళని ఏమనాలి?

ఏమీ అనవద్దు బాబూ, వాళ్ళమీదపడి వెళ్ళితిరిగేంతకం మనలో ఎప్పుడూ ఉంటూ ఉంటారు.

**కె. కె, హైదరాబాదు**

కొందరి చేష్టలకి మాటలకి పొంతికే ఉండదేమిటండీ?

దానికి ఆశ్చర్యపడడం దేనికి కె కె గారూ? ఈ కథ వినండి వేటగాడు తరిమితే పరుగెత్తివచ్చి ఎక్కడ్రలు కొట్టే ఓ ఆసామీని రక్షించమని అడిగింది "సరే దోపలికిపోయి దాక్కో" అన్నాడు వాడు వేటగాడు అటువచ్చి "ఇలా నక్క గానీ వచ్చిందా?" అని అడిగాడు "లేదే ఇటురావడం నేను చూడనే లేదే" అంటూ గట్టిగా అంటూనే చేతిలో నక్క దాక్కున్నవైపు చూపించేశాడు! వేటకాడది గుర్తించక వెళ్లిపోయాడు కాని నక్కమటుకది గ్రహించింది ఇవతలికి వచ్చి మాట్లాడకుండ వెళ్లిపోతుంది "చూశావా? నీకు ఆశ్రయం యిచ్చా. కొంచెం కూడ విశ్వాసంలేదు చెప్పకుండ వెళ్లిపోతున్నావు" అని నిందమోపాడు కర్రలవాడు 'నీలాంటి వారికది అనవసరం నీ మాటలకి చేతలకి పొంతికేది?" అని అడిగిందట నక్క పైకి సుగుణాలు పోయేలుగా ఉంటూవచ్చి దొంగల్లా ప్రవర్తించే వారుంటూనే ఉంటారు

**పి. కె. ఆర్, విశాఖపట్నం**

నే వ్రాసినలేఖ నాకు తిరిగి యివ్వమంటే ఇవ్వడంలేదు నాకేదో చాలా భయంగా ఉంది?

ఏం వ్రాశారేమిటి? అంతగా భయపడుతున్నారు? అయినా ఉత్తరం ఎవరు వ్రాయమన్నారు? వ్రాసిన లేఖ సాక్షిఅయి నిలిచి ఉంటుందని తెలియదా మీకు?

**వి. ఎస్. ఆర్. డి, డెరాడూన్**

మా వారిజీతం నెలపొడుగునా సద్దడంలేదు ఎంత దుబారా చెయ్యకపోయినా మాసం చివరికి వచ్చేసరికి కటకటలాడిపోతూంది

ద్వారం పొట్టిదైతే వంగినడవడం అలవాటు చేసుకోవాలన్నారు పెద్దలు జీతానికి కర్చుకి సరిపెట్టుకల్గడమే మీ వేర్పు అప్పులేకపోవటం ఐశ్వర్య లక్షణం అని ఇటాలియన్ సామెత.

**డి. డి, మద్రాసు**

పని మనుషులకి కొరతలేదు అయినా ఇంట్లోపని తెమలదు. దీనికి తరుణోపాయం సూచించకలరా?

సేవకులింట్లో ఎక్కువ అయిపోతే చేసేపని లుండిపోవడం తప్పనిసరి ముందు వారిసంఖ్య తగ్గించండి

**ఎమ్. జె. ఎస్, కోసిగి**

మానవులు మనిషిలోని మంచిని గుర్తించరు చెడు ఉన్నా లేకపోయినా ఉన్నదని ప్రచారంచేసే పెద్దలుంటారు. మనిషిలో మంచితనం ఉన్నా ప్రయోజనంలేని మంచితనం ఎందుకు?

ప్రయోజనం లేకుకదా అని ఇంటికి పునాది మట్టం తగ్గిస్తారా? మనిషి శీలానికి మంచితనం పునాది. అదిఉన్నదని గుర్తింపబడ్డా, గుర్తింపబడకపోయినా— అది ఉండవలసినదే.

**బి. పి, ఆటపాక**

డబ్బున్నవాళ్లని గౌరవిస్తారు. లేనివాళ్లని చూచి అసహ్యించుకుంటారెందుకు?

డబ్బులేని వాళ్లు డబ్బున్నవాళ్లని యాచించడం చూస్తూ ఉండడ చేత అయినా గౌరవానికి డబ్బు ఉండడం లేకపోవడం కాదు ప్రధానం శీలం

**పి. ఎస్. కె. ఆర్, ఒంగోలు**

మనుష్యుల అంతర్యాన్ని తెలుసుకోకుండా మనముకు తోచిన అభిప్రాయాన్ని ఏర్పరుచుకొనడం ఎంతవరకు సమంజసం?

కొంతవరకు.

**వి. వి. ఎస్, కరీంనగరు**

జీవిత ప్రవంతియొక్క రుచి చూసేందుకు జీవితపు నాల్గు దశలలో ఏది సరిపూర్ణమైనది? ఎందుకు?

యవ్వనదశ ఆ దశలో జీవితప్రవంతి తుళ్ళి తుళ్ళి గట్టు దగ్గరనుంచి సాఫీగా ప్రవహించటం దాకా సాగుతుంది అప్పుడప్పుడే అర్థం అవుతుంది.

**డి. టి, ఉరవకొండ**

సాధారణముగా తప్పు చేస్తున్నామని తెలిసీ కూడా సరిదిద్దుకొనుట మానవలక్షణం. కాని కొందరదే తప్పుచేస్తూ ఉంటారు కారణం?

కారణం ఏముంది? తమ్ముతామే సరిదిద్దుకుంటూ— తప్పుచేయడం వ్యసనంగా అలవాటుచేసుకొంటారు.

**పి. పి. డి, రాజమండ్రి**

నాకు పట్టుమాలిన పిచ్చుకం. ఏ పనీ ఒక్కసారి చేసి ముగించలేను

అదే— బద్ధకించిన పని ఎదిపర్చు తిరిగి తిరిగి పనిపని చెప్తుండిపోతారు.



# ఎవరికి వారే...

## ......కె. రామలక్ష్మి........

మా ఇళ్ళ మూడు తరాల అంటే సుఖదుఃఖాల జీవితాలు గమనిస్తూ రావడానికి కారణాలు అనేకం ఉండవచ్చు, కొట్టడం, తిట్టడంలాంటివి, కోపం, వదిలిపెట్టడం, మౌనగించటం అన్నీ ఎంతో కొంత భార్యాభర్తల మధ్య విముఖత పెరగడానికి దోహదం చెయ్యవచ్చు కాని కొన్ని సమయాలలో మనం ఊహించని చిన్న చిన్న విషయాలు కూడా యీ ఎడముఖం పెడముఖాలకి నాంది పల్కవచ్చు. ఇలా అనిపించడానికి కారణం ఈ మధ్యనే మా పక్కింటిలో దిగిన కొత్త కాపురం. ఆ భార్యాభర్తలని చూస్తే 'పిడిముడి సామరస్యంలేదు వీళ్ళకి' అని నాకు అనిపించుకొంటూ ఇంకా జరుగుతున్నా?' అనిపించింది. కొంచెం నాకు కలిసిన మరునాడే ఆవిడ నా కోడలుతో చెబుతూ 'మాకు పెళ్ళయి తొమ్మిదేళ్ళయింది ప్రతి చిన్నవిషయంలోనూ ఏపి అభిప్రాయం లేదమే!' అంటూ ఏకరువుపెట్టింది. 'ఒక్క మాట సహాయంలేదు. మంచి సహాయం లేదు. ఆయన, ఆయన సుఖం, ఆయన స్వార్థం - అంతా ఆయనే' అంటూ కంట తడిపెట్టింది. 'ఇంటిపని ఎలా చెయ్యాలో నా కెందుకు?' అంటారు నా వంటా వార్పూ, నా రూపురేఖలూ, అన్నీ ఎప్పుడూ లోకువ చేస్తూనే ఉంటారు. 'వీరావిడ వీరాయన చేసుకుని నాకూ కొంచెం చేయూతగా ఉంటే పంచభక్ష్యపరమాన్నాలూ గుబగా అలంకరించుకుని వడ్డించేదాన్నే' అని ఆవిడగారు చెప్పుతుంది! 'నా పని తక్కువై పోతుందన్నట్లు ఎక్కడివక్కడే అసహ్యంగా పడేస్తారు బాత్‌రూములో బట్టలు కిందపడేస్తారు. టూత్ పేస్టు ట్యూబు మధ్యన నొక్కేస్తారు, మూత పెట్టరు. బ్రష్ దగ్గిరనించి తుడిచి నే పైనపెట్టాలి' అంది. 'ఇలాంటి చిన్నవి చితకవీ కలిసి ఎంత పేరుకుపోతాయో ఊహించలేరా?' అంది జాలిగా. 'ఇలాంటి మనిషిని సాధించకుండా ఉండాలంటే—ఏ యోగీశ్వరుడో కావాలి! పోనీ యింత చేస్తానా [illegible] వాళ్ళంటే [illegible]. '[illegible] [illegible]గొప్పుతారు' అంటారు. 'నేనేం తక్కువ తిన్నానా నాకూ వాళ్ళవాళ్ళంటే గిట్టదు. ఎంతసేపూ గొప్పలు పోతూఉంటారు.' ఇలాంటివే యింకా ఎన్నో జ్ఞాపకంరాని చిన్న చిన్న విషయాలపై సహితం మేం చిటచిట లాడిపోతూ ఉంటాం. వెనక్కి తిరిగి చూసుకుంటే ఇన్ని సంవత్సరా లెలా గడిచి పోయాయా అనిపిస్తుందండి' అంటూ సాగతీసిందామె.

నా కిలాంటి గొడవలు విన్నప్పుడు—సాధారణంగా ఓర్పు నశించదు. కాని యీావిడగారిని చూస్తేమటుకు చెప్పే కోపం వచ్చింది. 'ఏం లోటులేదు. వీరారు ఒకరికి ఒకరు తగినట్టే ఉన్నార'నా లనిపించింది. దూరదృష్టి లేదు. స్వార్థానికి అంతులేదు—వీరికి. ఎవరి వ్యక్తిత్వాన్ని వాళ్ళు పట్టుకు పాకులాడుతూ ఇన్నాళ్ళలా భార్యాభర్తల్లాగా ఉండగలిగారో ఆశ్చర్యం వేసింది. 'ఒకరిపై ఒకరి కింత విసుగు అసహ్యం పెరగడానికి కారణం ఏమిటి? పెళ్ళయిన కొత్తలో బాగానే ఉండేవారుగా' అని అడగా లనిపించింది.

రక్షణకోసం, హాయిగా కాలం గడిచిపోవడంకోసం ఆడది పెళ్ళాడితే—ఇంట్లో పనిసాగటంకోసం, సుఖంకోసం తన [illegible] తన [illegible]పెట్టడం కోసం మగవాడు పెళ్ళిచేసుకోవడంలో తప్పేముంది? పెళ్ళంటూ చేసుకున్నాక మనం 'మనకి' అన్నది వస్తుందికదా? యీ చిన్న విషయాలపై తగవులేమిటి? ఇవి యింకా పెద్ద ఇబ్బందికి చిహ్నాలకా సూచనలేగాని కారణాలు కావు...కొందరు దంపతులిలాంటి చిన్న చిన్న పనులు తను ప్రేమించిన వ్యక్తికోసం చేయడంలో ఎంతో ఆనందం పొందుతారు. గౌరవానికి తక్కువను కున్న ఇటువంటి పనులలో మాటలలో చెప్పలేని సన్నిహితత్వం కదలాడుతుంది. చేతకాకపోయినా పిల్లాణ్ణి ఎత్తుకు తిప్పుతారు కొందరు తండ్రులు—పిల్లాడి తల్లి మీది ఆపేక్షతో! అది తమ అభిమానాన్ని చూపడంలో ఒక విధానం మాత్రమే. కాని మా పక్కింటిదంపతులిలా ప్రేమనికాక అసహ్యాన్ని ప్రదర్శించుకునేఅవకాశాలకోసమే చూస్తున్నట్టుంది!! ఒకరి కుటుంబాన్ని గురించి ఒకరు దెప్పిపొడుచుకోవడంలోనే యీ సంగతి తెలుస్తోంది.. వారు ఒకరికొకరు ఆనందం పంచుకోవడం మరిచిపోయారా అనిపిస్తుంది!...ఈ అహం తృప్తికి వేళ్ళపాతుకుని ఏదో కారణం ఉంటుంది. దాన్ని కనిపెట్టడానికి వ్యవధి పడుతుంది. ఇద్దరూ కూర్చుని ఒకరి కష్టాలు ఒకరికి చెప్పుకుని... అర్థం చేసుకుందుకు ప్రయత్నిస్తేనేం? 'ఇద్దరికిద్దరూ స్వార్థపరులే కనుక వివరిదారి వారిదిగా కంటే కలిసిన దారినే సుఖంగా ఉంటారేమో' అన్నాను, మూతి మూడు తిప్పులు తిప్పిందామె.

కాలం మనంకోసం ఆగిపోదు. చేజారిన అవకాశాలూ తిరిగిరావు. ఇలా జీవితకాలం గడిచిపోయినా గడిచిపోతుంది. ఒకరి కొకరి సాన్నిహిత్యం సాంగత్యం ఇచ్చిపుచ్చుకొనే అవకాశాలు తిరి కూర్చుని చంపేసుకోకూడదు. తెలివితక్కువవాళ్ళే కాలం శాశ్వతం అని అనుకుంటారు. మీరే ఆలోచించి చూడండి...వ్యర్థంగా అసహ్యం పెంచి ఒక ఇంట్లో సంసారం సాగించేకంటే స్పర్థతోనే సాన్నిహిత్యం పెంపొందించుకుని జీవితాలు పండుకోవడం మేలుకదా!




'మినిశారీ' గురించి నీ అభిప్రాయం ఏమిటి?' అని అడిగింది ఓ స్నేహితురాలు ఈమధ్య అప్పటివరకు ఈ రకం చీరె కట్టడాన్ని ఓ వింత క్రింద చూడడమేగాని దాని మీద ఖచ్చితమైన అభిప్రాయం అంటూ ఏర్పడలేదు నాకు. బొంబాయిలో జన్మించిన ఈ ఫాషన్ ఇంకా ఇటు రాలేదు.

'ఈ స్టైల్ ఎక్కువకాలం నిలుస్తుందంటావా?' అన్నది స్నేహితురాలు మళ్ళీ.

'ఆలోచించవలసిందే!' అన్నాను నేను. ఏ ఫాషన్ అయినా సంవత్సరాల తరబడి నిలవదు ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కటి ఫ్యాషన్ అయితే మరొకప్పుడు ఇంకొకటి ఫ్యాషన్ అదివరకు మహారాణీల్లా రోడ్లమీద జీరాడే పమిటలు, పాదాలుదాటి చెప్పులు కూడా కనిపించకుండా చీరె కుచ్చెళ్ళు మోచేతులు దాటిన జాకెట్లూ ఫ్యాషన్ ఇప్పుడో? మినిజాకెట్లు ఏనాడో అవతరించాయి. స్లీవ్‌లెస్ (చేతులు లేవు), బాక్‌లెస్ (వీపు కూడా లేదు సుమా!), బటన్‌లెస్ (గుండీల అవసరం లేదు), జాకెట్లు యిప్పుడు ఫ్యాషన్. షర్మిలాటాగూర్‌కీ, సైరాబానూకీ సినిమాల్లో వేస్తే బాగుండవచ్చుగాక. లావుగా, పొట్టిగా వున్న వాళ్ళకి ఎలా వుంటాయో దురూహ్యం. జాకెట్ల సంగతి ఇలా వుంటే యిప్పుడు మిని పమిటలు కూడా వచ్చాయి మిని పమిట అంటే బొత్తిగా బెత్తెడు పమిటలు అన్నమానం వాటిని పరిజేసుకోడమే పని! మిని జాకెట్లనీ, మిని పమిటలనీ ఎలాగో చూడవచ్చు. కానీ మిని శారీలని ఎలా భరించడం? పోనీ ఎలా సహించడం? మోకాళ్ళకి నాలుగంగుళాల పైకి చీరెకట్టడం ఊహించుకోండి బట్ట పొదుపు దృష్ట్యా మంచిదే కానీ. సంప్రదాయసిద్ధమైన మన చీరెకట్టు పాశ్చాత్య వాయువు సోకి యిలా భ్రష్టమైపోవడం విచారకరం. భారతీయుల చీరెకట్టు విదేశీయుల అభిమానాన్ని చూరగొన్నది. విదేశీయులు చాలామంది మన కంచిపట్టు, ధర్మవరం, బెనారస్, వెంకటగిరి, గద్వాల్ చీరెలను మోజుపడి కొక్కుకుని కష్టపడి కట్టుకుని మురిసిపోవడం మనం చూస్తూనే వుంటాం అటువంటిది, 'మినిస్కర్ట్'ని అనుకరిస్తూ 'మినిశారీ' అంటూ బయలుదేరదీయడం హాస్యాస్పదం. అసలు ఇది ఒక మిని యుగమేమో! రూపాయలనోట్లు చిన్నవైపోయి, మినికరెన్సీ వచ్చింది మిని రేడియోలు, మిని బ్యాటరీలు వచ్చాయి కరువు రోజుల్లో, తిండి గింజలు, ఆహారాలు దొరకడం కష్టంగావుండి 'మినిమీల్స్'తో సరిపెట్టుకోవాల్సి రానూ వస్తోంది. పాల ధర పెరిగిపోయింది గనుక, ఇకనుంచీ మినీ కప్పులు కొని అతిథులకి మినీ కాఫీలు యివ్వవలసిందే. అలాగే మిని టిఫిన్లు ఇవ్వాల్సి అలా వుంచి గుంటూరు చేంతాడుల్లాంటి సినిమాలు గాక మినీ సినిమాలొస్తే ఎంత బావుండుననిపిస్తుంది కదూ! అది అనంత



# మిని యుగం

పేరు అనుకోండి ఇక మంచి పత్రికలు వ్యాకరణాన్ని సైజు తగ్గించి మిని పత్రిక




కూడాలేమో చూడాలి! ఒక్కొక్క మనం [illegible] ఉండేది మిని ఇళ్ళల్లోనే. అయితే

అద్దెలు 'మిని' కావనుకోండి. ఇలా ప్రపంచం అంతా మిని ప్రపంచం అయిపోతోంది. కొన్నాళ్లకి మనుష్యులు కూడా సైజు తగ్గి మిని మనుష్యులు కావడానికి ఏదైనా మార్గం కనిపెడతారేమో చూడాలి! ఏది ఏమైనా ఫ్యాషన్లు కంటికింపుగా వుండాలి గానీ కంటగింపుగా వుండ గూడదనేది సర్వ జనామోదకరమైన విషయం. ఏదైనా ఒక స్టైల్ ని అనుకరించినప్పుడు మనదేశ పరిస్థితులకి ఇది తగునా అని ఆలోచించడం వివేకవంతుల లక్షణం అంచేత విద్యావతులైన మహిళలు, తమ సంస్కారానికి ప్రతిబింబమైన దుస్తులు ధరించడం వుచితం. కానీ, శరీరంలోని వివిధ భాగాల వొంపు సొంపులను రోడ్ సైడ్ రోమియోలని ప్రదర్శించడానికి వుపయోగపరచడం దారుణం. ఫ్యాషన్లు వెర్రితలలు వేయడం

అంటే ఇదే. పెరుగట విరుగుట కొరకే అన్నట్లు ఏ ఫ్యాషన్ అయినా గొర్రెల మందలా అందరూ అనుకరించడం మొదలు కాగానే, అది ఓల్డ్ ఫ్యాషన్ అయిపోయి అంతక్రితం ఓల్డ్ ఫ్యాషన్ అనుకొన్నది మళ్లీ కొత్త చీరె కట్టుకుని వస్తుంది ఈ ఫ్యాషన్లు ఇలా పరిభ్రమిస్తూనే వుంటాయి. పారిస్‌లో నిమిషానికొక ఫాషన్ మారిపోతూ వుంటుందట ఒకావిడ టైలర్ దగ్గర మంచి బట్టలు తీసుకుని రొప్పుకుంటూ బజారు వెంట పరిగెత్తుకుని పోతోందట. ఎందుకమ్మా అలా పరిగెడుతున్నావు నిలబడి నీళ్ళు త్రాగరాదా అన్నారట ఎవరో! 'అమ్మ




బాబోయ్, లేటెస్ట్ ఫ్యాషన్ అని ఈ గౌను కుట్టించాను. ఇది వేసుకోడం ఆలస్యం అయిందంటే ఫ్యాషన్ మారిపోతుంది' అంటూ వెనక్కి తిరిగి చూడకుండా వెళ్లిపోయిందట ఆవిడ. ఒకప్పుడు లూజుగా జడల్లుకోడం ఫ్యాషన్. ఇప్పుడు మళ్లీ నడినెత్తిమీద నించి జడవేసుకోడం స్టయిల్. కనుక పరిగెత్తే ఫ్యాషన్ల వెంటబడి రొప్పుకుంటూ పరిగెత్తక, మన ఒంటికి, ఇంటికి, ఇంటి పరిస్థితులకి అనుగుణంగా డ్రెస్ చేసుకోడం మంచిదనుకుంటాను. ఈ మిని యుగంలో 'మిని' వ్యాసాలు వ్రాయాలిగానీ ఇంకా పెద్దవి వ్రాయకూడదనుకుంటాను.

—పి. ఎస్.

# డాక్టర్ కబుర్లు

## భయం—చికిత్స!

సైరా? ఉండేవారు కొందరు ప్రయత్నించి ముఖం శేవురించేట్లు చేసుకోగలరు. కొందరు గుండె కొట్టుకునే వేగన్ని పెంచుకోగలరు? మరివీరో? ప్రయత్నించి చూడండి!

ఊరికే ప్రయత్నించి వూసినకొద్దీ మీ ప్రయత్నాలు మరీ నవ్వుపుట్టిస్తాయి. ఈ నవ్వులోనే ఉంది చికిత్సకి ఆధారం. ఈ రకం చికిత్స కొన్నిటిని చూసి భయపడేవారికి బాగా పనికి వస్తుంది, అంటున్నారు నిపుణులు.



కొందరికి గుండెపోటు వస్తుందని భయం. కొందరికి విమానాలలో వెళ్లటం భయం. కొందరికి వంతెనలు దాటటం భయం. మరికొందరికి నిద్ర పట్టదని భయం. ఈ రకం భయాలకి 'మానసిక' కారణాలు వెతికి పట్టుకుని చికిత్స చేద్దామని ప్రయత్నించే అలవాటు కొంతకాలంగ అమలులో ఉంది.

ఇలా వెతికి పట్టుకునే బదులు భయాన్నే ఎక్కువ చేసుకుంటే!

నిద్రపట్టని వారు నిద్రపోరాదని నిశ్చయించుకుంటే? రేడియో, పుస్తకాలు, దీపాలు అన్నీ అపి— మానేసి మేలుకునే ఉందామని ప్రయత్నిస్తే నిద్రపడుతుంది— అని కొందరు నిపుణుల నమ్మకం.

భయపడేవారు ఇంకా భయం తెచ్చుకోవాలని ప్రయత్నిస్తే భయం పోవచ్చు......

హెచ్ ఎల్. హెర్ష్‌సోన్
(కాపీరయిటు)

# నిగనిగలాడే, అందమైన జుట్టు

## టాటావారి సువాసనగల కేస్టర్ హేర్ ఆయిల్

### జుట్టును, రోజంతా చెదరకుండా వుంచును

దువ్వుకొన్న తమ జుట్టును చెదరకుండా వుంచుకుంటారు
కాబట్టి, వ్యక్తులు అందముగా, ఆకర్షణీయముగా కనబడ
తారు. మీరు కూడా టాటావారి సువాసన గల కేస్టర్ హేర్
ఆయిల్ వాడండి. దీనిలోని విశేష గుణముల వలన మీ
జుట్టు ఆరోగ్యంగా వుండడమే గాక దానికి ప్రత్యేకత గల
అందం వస్తుంది. మరియు రోజంతా నిగనిగలాడుతూ
వుంటుంది.

క్రొత్త, ఆకర్షణీయమైన సీసా 3 సైజులలో లభిస్తోంది



టాటావారి కేస్టర్ హేర్ ఆయిల్...
నిగనిగలాడే, చెదరని, ఆరోగ్యమైన జుట్టు కొరకు



సీరియల్

కె. రామలక్ష్మి

### జరిగిన కథ

కళ్యాణి గవర్నమెంటు హాస్పిటల్లో డాక్టరు. స్త్రీస్పెషలిస్టు అంటే ఆమెకు సంతకాల గొడవే ఎక్కువ. మతి చాంచల్యంతో ఒక పిల్లవాణ్ని హత్య చేసిందన్న నేరారోపణపై, పోలీసు ఉద్యోగి ఒకామెను కళ్యాణివద్దకు తీసుకొచ్చాడు. కళ్యాణి ఆమెని పరీక్షించింది. ఆమె పేరు సరళ. చేతులో గుడ్డలమూటని పసిబిడ్డలా కాపాడుకుంటోంది! కళ్యాణి ఆమెమీద ఎంతో జాలిపడింది. స్నేహితురాలు లాయరు శాంత సహాయాన్ని కోరింది మర్నాడు ఇద్దరూ కలిసి సరళని చూట్టానికి పిచ్చాసుపత్రికి వెళ్ళారు. కాని, సరళ దగ్గర్నుంచి ఎక్కువ వివరాలు సేకరించలేక పోయారు. శాంత ఆమె తరఫున కోర్టులో వాదించడానికి వకాల్తా పుచ్చుకుంటుంది. సరళ చెప్పిన పంతుల్ని విచారించడానికి స్నేహితురాళ్ళిద్దరూ మరికొంతమంది కలిసి నందూరు వెళ్తారు. అక్కడ, పంతుల్ని గురించిన సమాచారం కొంత సేకరించారు.

## 5

'బాగుందికదూ' అంది కళ్యాణి లోపలికి వస్తూనే. నిజమే. కోవెల లోపల చల్లగా బాగుంది. చుట్టూ నందివర్ధనం చెట్లు, గన్నేరుచెట్లూ ఉన్నాయి. అల్లిబిల్లిగా అల్లుకుపోయిన కాశీరత్నం తీగె నుంచి అక్కడా అక్కడా ఎర్రని పూలు తళుక్కుని మెరుస్తున్నాయి.

'గుడి ముందుకువెళ్లి కారుకి ఎటు నీడ వాలో చూద్దాం. తరవాత రెస్టుగా కూర్చోవచ్చు' అంది శాంత.

కోవెల ముందు ప్రాంగణంలోకి వచ్చి గుమ్మం దాటి అటూ ఇటూ చూసింది కళ్యాణి.

ఎడంవైపుగా మర్రిచెట్టు కన్పించింది.

'నే వెళ్లి అన్నీ పట్టుకువస్తా. మీరు కూర్చోండి' అంది. కారు దగ్గరకి వెళ్లి తలుపులుతీసి బాస్కెట్ పైకి తీసింది. పేక, రెండు నవలలు తీసి తిరిగి తలుపువేసి కోవెలకి వచ్చేసింది కళ్యాణి.

కోవెల మరీ పెద్దదీ కాదు.

అలా అని మరీ చిన్నదీ కాదు.

వెనకవైపు ఎత్తుగా గోపురం కట్టాలని ప్లాను వేసినట్టుంది. కాని సగం లేచి ఊరుకుందా కట్టడం. గంట స్తంభంమీద పావురాలు వాలి చూస్తున్నాయి: అక్కడక్కడ రాతిస్తంభాలు పెట్టినా చాలా మటుకు సిమెంటుతో కట్టినవే.

మండపంలో జంబుఖానాపరిచింది కళ్యాణి.

టైముకేసి చూసింది శాంత.

'అబ్బా, అప్పుడే పన్నెండవుతోంది' అంది.

'అయితే తినేసి పడుకుందాం.' అంది కళ్యాణి నవ్వుతూ.

'తిండి తక్కువ తినడానికి నరసింహం గారిని చూసి నేర్చుకోరాదు?' అంది నవ్వుతూ శాంత.

'అవును శాంతా ఎలా ఉండగలుగుతారో?' అంది కళ్యాణి.

'ఏముందీ ఆయనలాగా ఓ ఏభయిఏళ్లు మానేసి చూడు' అని సలహా యిచ్చింది స్నేహితురాలు.

'పొద్దుట తిన్న టిఫిను అప్పుడే అరిగి పోయి ఇప్పుడు ప్రాణం అవురావురు మంటూంది. ఏభయిగంటలకి దిక్కులేదు— ఏభయిఏళ్లు ఊహించడం కూడా కష్టం' అంది బాస్కెట్ మూతతీసి అందరికీ అన్నీ సద్ది ఇవ్వడం ప్రారంభిస్తూ.

ఆ కబురూ ఈ కబురూ చెప్పుకుంటూ తినడం ముగించారు.

'జామకాయలు ఉంచు. మధ్యాహ్నం తిందాం' అంది శాంత అప్పటికే కత్తి కోసం బాస్కెట్‌లో వెతుకుతున్న కళ్యాణిని చూసి.

'అదీ పోయింటే' అని జామకాయలు బాస్కెట్‌లో పడేసింది కళ్యాణి.

కళ్యాణి జార్జెట్ హేయరు పుస్తకం అందుకుని నడుం వాల్చింది.

శాంత సుఖంగా వత్తిగిల్లి పడుకుంది.

స్నేహితురాళ్లిద్దరూ పేకలు పంచుకోవడం ప్రారంభించారు.

'ఈరేటున సాయంత్రం ఎప్పటి కవుతుంది? ఎప్పుడా పంతులన్నాయన వస్తాడు?' అంది ఒక స్నేహితురాలు.

'ఏమో మన పని సులభం చేయాలంటే ఆయనగారు పెందరాడే రాకూడదూ?' అంది పేక కలుపుతూ ఇంకో స్నేహితురాలు.

చూస్తూండగానే నీడలు స్థాన చలనం పొందుతున్నాయి.

ఈ లోకం మరిచి హాయిగా చదువుకుంటుంది కళ్యాణి

హాయిగా నిద్రపోతూంది శాంత.

ఆట తీవ్రంలో ఊపిరి కూడా సరిగ్గా

పిల్చుకోవడంలేదు మిగిలిన ఇద్దరూ.

హఠాత్తుగా ఏదో నీడ మీద పరచి నట్టయి తలెత్తి చూసింది కళ్యాణి.

ఎదురుగుండా ఒక వ్యక్తి నిలబడి వింతగా చూస్తున్నాడు.

'ఎవరు మీరు?' పుస్తకం చూస్తూ అడిగింది.

'నా పేరు చిట్టిపంతులు అంటారు' అన్నాడా వ్యక్తి.

ఆ మాట విన్నది కలలోనా? నిజంగానా అన్నంత అనుమానం కల్గింది కళ్యాణికి.

స్నేహితు లిద్దరూ పేకాట ఆపి చూస్తున్నారు.

శాంత మటుకు నిద్రపోతూనే ఉంది.

'మీ రెలా వచ్చారు? ర్రాలిదాకా రా రన్నారే' ఆశ్చర్యం వెలిబుచ్చుతూ అడిగింది. ఓ పక్క అడుగుతూనే ఒక చేత్తో శాంతని నిద్రలేపింది.

'ఉట్టినేనే ఈ రోజు పెందరాడే వచ్చాను.' అన్నాడు పంతులు.

'నమస్కారం. మేం ఉదయమే మీ కోసం వచ్చాం' అంది.

అప్పటికి తేరుకుని,

'నాకోసమా?' ఆశ్చర్యంగా అడిగాడు పంతులు.

'అవును ఆ విషయాలన్నీ మా శాంత మాట్లాడుతుంది. శ్రమ అనుకోకుండా కూర్చుంటారా?' అడిగింది కళ్యాణి.

'దానికేం ఇప్పుడే వస్తాను. మీరు విశ్రాంతి తీసుకోండి' అంటూ కోవెల ప్రాంగణంలో ఓ మూలగా ఉన్నా పాకవైపు నడిచాడు పంతులు.

హఠాత్తుగా పంతులు రావడం ఆశ్చర్యం లోనూ ఆనందంలోనూ ముంచెత్తింది శాంతని.

'మన పని సులువైంది' అనుకుంది.

తనకోసం ఇంతమంది ఎదురు చూడ్డం పంతులుని కూడా ఆశ్చర్యంలో ముంచెత్తింది. 'ఎందుకై ఉంటుంది చెప్మా' అనుకుంటూ పాక తలుపుతీసి లోపలికి వెళ్ళాడు. ఎక్కడి బద్ధకం అక్కడ వదలిపోయింది. ముఖాలు కడుక్కొని కూర్చున్నారు శాంతా వాళ్ళూ.

శుభ్రంగా స్నానంచేసి బట్టలు మార్చు కుని ఓ పళ్ళెంలో జీడీ ముక్కలూ కారప్పూసా నన్నని పకోడీలూ అరటిపళ్ళూ పెట్టుకుని పంతులు మండపంలోకి వచ్చాడు.

'రండి రండి' అంటూ ఆహ్వానించింది శాంత.

'ఏవో ఈ కొంచెం ఎంగిలి. టీ తాగి మాట్లాడుకుందాం' అన్నాడు పంతులు కూర్చుంటూ.

'థ్యాంక్స్' అంటూ పళ్ళెం అందు కుంది కళ్యాణి.

'మేం వచ్చినపని చాలా ముఖ్యమైనది పంతులుగారు. మీ సహకారం తప్పకుండ ఉంటుందనే గట్టి నమ్మకంతో వచ్చాం' అంది అసలు విషయంలోకి వస్తూ శాంత.

'దానికేముందండి, చెప్పండి అసలు విషయ మేమిటో' అన్నాడు పంతులు.

'ఏం లేదు. ఇంత హఠాత్తుగా మేం మిమ్మల్ని వెతుక్కుంటూ రావడం ఆశ్చర్యం గానే ఉండొచ్చు. కాని ఈ విషయం అంత ముఖ్యం కనుకనే వచ్చాం. మిమ్మల్నో ప్రత్యక్ష సాక్షిగా తీసుకు వెళ్ళాలని వచ్చాం' అంది



# ఆడది

'పిచ్చిగానా?'

'అవును. సరళ అన్న పేరు మీకు పరిచయమైనదే అనుకుంటాను అవునా?' అడిగింది శాంత.

'చాలాకాలానికి విన్నా నా పేరు. మీరూ 'ఆ పిచ్చిది తెలుసా?' అని అడగ వందుకు సంతోషంగా ఉంది' అన్నాడు పంతులు. అతని కంఠస్వరం మార్దవాన్ని పలుముకుంది. 'ఆ అమ్మాయి ఒక హత్యా నేరంలో యిరుక్కుంది పిచ్చిదే హత్య చేసిం దని చాలా సాక్ష్యం అవతలివాళ్లు సంపా దించడం జరిగింది' ఆగింది శాంత.

ఓ క్షణం ఏమీ మాట్లాడకుండా కూర్చుండిపోయాడు పంతులు.

'సరళ హత్య చేయడమా? ఇది నమ్మ [illegible]క్యంగా ఉన్న విషయం. మీకు తెలుసో లేదో సరళ పదహారేళ్ల పిల్లలా ఉన్నప్పటినుంచి తెలుసు నాకు దీర్ఘంగా నిట్టూర్చాడు పంతులు. జ్ఞాపకాల మేఘాలు అతగాడి [illegible] కప్పివేస్తున్నట్లయింది

'పిచ్చిది హత్య చేసింది తమకు(రాడిని అని [illegible]

డాక్టర్ కళ్యాణి మటుకు సరళ పిచ్చి దంటే నమ్మలేదు నాకూ ఆమె ధోరణి విస్మయంగా తోచిందేగాని పిచ్చిదానిదిగా తోచలేదు. అందుకే కేసు తీసుకున్నాను మరిచేపోయాను. నా పేరు శాంత. లాయ రుగా ప్రాక్టీసు చేస్తున్నాను. ఈమె నా స్నేహితురాలు కళ్యాణి—డాక్టరు వీరిద్దరూ స్నేహితు[illegible] సరళాగా కంపెనీకోసం వచ్చారు' [illegible] పరిచయాలు లేటుగానైనా చేసింది [illegible]

'నమస్కారం' చాలా సంతోషం. మీరు తీసుకుంటున్న శ్రమ చూస్తుంటే పూర్తిగా ఈ లోకంలోనుంచి మానవత్వం పారిపోలేదు అనిపిస్తుంది. చెప్పండి—సంగతులు' అడి గాడు పంతులు.

'కేసు వాయిదావేయించి మీకోసం వచ్చాను. సరళ ఎన్నివిధాల అడిగినా ఏసంగతీ చెప్పడం లేదు. బహుశా పిచ్చిదానిలా బతికేయడమే సులభం అని నిశ్చయించుకున్న మనిషిలా ఉంది ఆమె ధోరణి. ఇన్నిరోజులు శ్రమ పడగా యధాలాపంగా మీపేరు చెప్పింది. వాకబుచేసి కనుక్కున్నాం. సోమవారం కోర్టుకి హాజరుకావాలని నా మనవి. ఏమంటారు?' అడిగింది శాంత.

'సరళది చిన్నప్పటినుంచి మొండిస్వభా వమే. బేజేతులా నడిచే బాటమీద నిప్పులు పరచుకుంటూ పోయింది.'

'అసలు ఆమె జీవితగాథపై కేసు నిల బెట్టి నేరం మాఫీచేయించాలని వాదన ప్లాను చేస్తున్నాను. ఇలాంటి స్త్రీ హత్య చేస్తుందా? అన్నది మనం నిరూపించ కల్గాలి. అదే చేయకల్గితే కేసు గెలుస్తాం. అది జరగాలంటే మీరు పూనుకోవాలి' అంది శాంత.

'తప్పకుండాను. అమ్మాయి జీవితం బాగుపడుతుందంటే నేనేమైనా చేస్తాను. చెప్పండి నేనెప్పుడు రావాలి?'

'మీరు సోమవారానికి వస్తే చాలు బహుశా నాలుగైదురోజులు ఉండవలసి రావచ్చు. మీ బసా అదీ కళ్యాణి ఏర్పాటు చేస్తుంది' అంది శాంత.

'అక్కర్లేదండీ, నాకు చాలామంది స్నేహితులున్నారు. నేనక్కడేగా చదువు కున్నది' నవ్వుగా నవ్వాడు పంతులు.

'మీరు త్వరగా రావడం మాకెంతో మేలుగాయుందండీ, లేకుంటే వెళ్లడానికి చాలా యిబ్బందిపడేవాళ్లమే. నరసింహం గారుకూడా మీరు సాయింత్రం కాని రారన్నారు' అంది కళ్యాణి.

'మీరు వారిని చూశారా?' అడిగాడు పంతులు.

'చూశాం. కొంచెంసేపు కబుర్లు కూడా చెప్పుకొన్నాం. చాలా వ్యక్తిత్వంకల మనిషిలా ఉన్నారు' అంది శాంత.

'ఆయననిగురించి మీకు పూర్తిగా తెలి యదు. ఎంత గుండె నిబ్బరంకలవాడు కాక పోతే అలా ఉండకల్గుతాడు. ఎందుకోసం వచ్చారో చెప్పారా?'

'మిమ్మల్ని కోర్టుకి తీసుకువెళ్లాలని చెప్పాం. దానికాయన 'పంతులు కోర్టు పక్షి కాడే' అన్నారు.' అంది శాంత.

'కేసు వివరాలేం చెప్పలేదుకదూ?' ఆత్రంగా అడిగాడు.

'లేదు—వివరాలేం చెప్పలేదు. ఏం! ఎందు కని అలా అడుగుతున్నారు' అంది కుతూ హలాన్ని అణచుకోలేక.

'అబ్బే ఏంలేదు. అనవసరంగా ఇలాంటివి ఆయన మనస్సుని నొప్పిస్తాయి. వార్తలూ విశేషాలూ ఏమైనా ఉంటే నేనే అప్పు డప్పుడు చదివి చెప్తువుంటాను' అన్నాడు పంతులు. ఏదో దాస్తున్నాడు అని అను మాన పడింది శాంత.

'ఒకరోజు ముందుగానే వస్తాను. సర ళతో మాట్లాడితే విషయాలు తెలియ వచ్చు ఏమంటారు?' అడిగాడు పంతులు.

'మీకేమైనా చెప్తుందంటారా? ఆ ఆశ నాకు లేదు' అంది కళ్యాణి.

'ఫరవాలేదు. చెప్తుంది. నాకు చెప్తుంది' అన్నాడు పంతులు.

'అయితే మరీ మంచిది. అయితే మీరు చెప్పదలచుకొన్న విషయాలు బోను ఎక్కి చెప్పేముందు క్లుప్తంగా నాకు చెప్పాలి' అంది శాంత.

'అలాగే. సరళని రక్షించాలి. అదే ఇప్పటి కర్తవ్యం' అన్నాడు పంతులు.

కళ్యాణి బాస్కెట్ సద్దేసింది.

జంబుఖానా దులిపి మడిచింది.

శాంత తన కార్డు ఇచ్చింది పంతులుకి.

'వెళ్ళొస్తాం మరిచిపోకండి' అంటూ కారుకేసి నడిచారు స్నేహబృందం.

కారు ఎక్కబోతూ మర్రిచెట్టుకి తిన్నగా పోతూన్న పుంతకేసీ చివర కన్పిస్తున్న కొండలకేసీ చూసింది కళ్యాణి.

ఎర్రని సంధ్య పరచుకొంది.

కొండ చరియలమీద అక్కడక్కడ మంటలు కన్పిస్తున్నాయి.

'రాత్రిపూట ఇది చూడ్డానికి చాలా బాగుంటుంది కదూ?' అంది కారు స్టార్ట్ చేస్తూ.

'ఆ మంటలనే కాబోలు కొరివిదెయ్యాలు అంటారు' అంది మూలగా ఒదిగి కూర్చుంటూ ఒక స్నేహితురాలు. కారు మర్రిచెట్టుకి ప్రదక్షిణంచేసి ఊరు పొలిమేర కేసి దూసుకుపోయింది.

వచ్చేటప్పుడు ఉన్న గాంభీర్యం ఎవరి లోనూ లేదు. బరువు తీసినట్టు హాయిగా ఉంది.

గోలగా కబుర్లు చెప్పుకుంటూ పొద

పోయారు.

ఎవరి ఇళ్లదగ్గిర వాళ్లని దింపి ఇల్లు చేరికాని టైము చూసుకోలేదు కళ్యాణి.

'అబ్బా తొమ్మిది దాటిందే' అనుకున్నప్పుడే ఎక్కడలేని అలసటా ముంచుకు వచ్చింది. త్వర త్వరగా స్నానాదులు ముగించి, భోజనందగ్గిర కూర్చుంది. తల్లి వేస్తున్న ప్రశ్నలకి సమాధానం చెప్తూ భోజనం ముగించి నిశ్చింతగా పక్కమీద మేను వాల్చింది కళ్యాణి సంధ్యారుణం అయిన మేఘాలూ, వాటిముందు నల్లగా నిలిచిన కొండా కొండమీద నాలుకలు పరచుకుంటూ వేస్తున్న చిన్న చిన్న మంటలూ కళ్యాణి కలలో కన్పించాయి.

(ఇంకా ఉంది)



శకూ అక్కను చూట్టమంటే దిగులు ఇన్నేళ్ళు పోయి చూడనందుకు బాధ. ఆ ఊరు వెళ్ళటమంటే ఎడారిలో ప్రయాణం. ఎక్కడో పదిమైళ్ళదూరంలో బస్సు వాది లేస్తుంది. అక్కణ్ణించి కాలినడక. లేక ఎడ్లబండి. ఇప్పట్లో వెళ్ళకపోతినో ఈ ఆంధ్రదేశం మళ్ళీ రావటం ఏ రెండేళ్ళకో!

శకూ అక్కనుదుట కుంకమ కనిపించదు అని చాలసార్లు అనుకున్నాను. కాని మొట్టమొదట — ఆ సముద్రపు టొడ్డు అగ్రహారంలో, పగుళ్ళల్లోంచి రావి మొక్కలేల్చిన నాచు పట్టిన గోడలతో, పచ్చటి గడ్డి మొలచిన పై కప్పులతో గోల్కొండ శిధిలాల్లా ఉన్న ఆ భవనంలో శకూ అక్కను చూసినప్పుడు కోప మొచ్చింది. కుంకుమ తీసేసి అక్కను అవమానపరుస్తున్నారు. భర్త లేనిది అని లోకానికి చాటుతున్నారు ఏ వొక్కరి రక్షణ లోనూ లేదు అని చిన్నబుచ్చుతున్నారు. ఏడుపొచ్చింది. నేను ఊహించుకున్నదాని కంటే మాసిపోయి కనిపించింది శకూ అక్క.

బళ్లో ఒకటో తరగతి చదువుకుంటున్న సుభాష్ నేను వెళ్లిన పదిహేన్నిమిషాలకి వచ్చేడు. మామయ్యరా అంటే కొత్తగా చూశాడు. దగ్గరకు తీసుకుంటే బలవంతంగా ఏడుపు తెచ్చుకుని జారిపోయి వెళ్ళిపోయాడు.

శకూ అక్క మొదట నాన్నగారి ఆరోగ్యం గురించి అడిగింది హోమియో మందు వాడుతున్నారు సుగర్ తగ్గింది అని చెప్పాను. అమ్మ గురించి అడిగింది. బావుందన్నాను. అక్క దురదృష్టానికి అమ్మ ఎప్పుడూ పడేబాధ చెప్పలేదు. అన్నయ్య గురించి అడిగింది. బాగా ఉన్నాడు. పిల్లలు —రేణు, వెంకటేశ్వర్లు, సుభ—గురించి ఎంతో తెలిసినట్టు అడిగింది. వాళ్ళని శకూ అక్క అసలు చూళ్ళే లేదు. ఉత్తరాల్లో తప్ప. సుభని మిషనరీ ఇంగ్లీష్ మీడియమ్ నర్సరీలో చేర్పటానికి మూడొందలు డొనేషన్ కట్వాల్సొచ్చిందని నేను చెప్తుండగా —శూన్యంలో ఏవేవో చిత్రాలు చూసి—దుఃఖాన్ని ఆపుకోలేక మొదట బొటబొట కన్నీరు కార్చి మొఖం చేతులతో కప్పుకుని వెక్కివెక్కి ఏడ్చింది..

ఏడుపు విని ఆ గదిలోకి మామయ్య

వచ్చాడు. అత్త వచ్చింది. ఇంట్లో మనుషులు వచ్చారు. శకూ అక్కను చుట్టుముట్టారు. ఏమో అనుకున్నారు. నాకు వినిపించలేదు. అక్క ఏడుపంతా నా గుండెల్లో కురుస్తోంది. అక్క కన్నీరంతా నా కళ్లల్లో నిండిపోయింది.

దయ్యాలు చుట్టుముట్టినట్లయింది. కనీసం ఏడ్చుకోనివ్వలేదు. ఇద్దరు నన్ను బయటికి మోసుకొచ్చారు. ఆడాళ్లు అక్కను వేరే గదిలోకి ఈడ్చుకుపోయారు. అట్లా చేయటం నాకు అవమానమయింది.

మన సాంఘిక వ్యవస్థలో ఏర్పడిన ఈ సంబంధాలు ఎంతవరకు మేలు చేస్తున్నాయో ఏమో. నన్ను చూసినాకా అక్కలో రేగిన దుఃఖం, ఆ ఏడుపు ఎందుకని? నేనేం చేయనందుకు? ఆమె ఏ తప్పు చేసినందుకు? కన్నీరు మున్నీరుగా గుండెలు అలిసిపోయేట్టు భోరున ఏడ్చింది ప్రయాణపు బడలిక, దప్పిక, ఆకలి ఏమీలేవు గుండె తరుక్కుపోయింది. అన్నయ్య. అమ్మ, నాన్నగారు, పిల్లలూ—మేము సుఖంగా బతుకుతున్నాం. ఎప్పుడూ ఇంత దుఃఖం ఎవ్వరమూ చూళ్ళేదు. కొంచెంసేపు కోపాలు, పట్టుదలలు తప్పించి ఆత్మని ఊపిరాడనీయకుండా ముంచేసే ఇంత కన్నీరు తెలీదు.

క్షణం క్రితం నన్ను ఆనందంతో పలకరించిన మామయ్య కొరకొర చూస్తున్నాడు.

అక్కడ కూచోలేక వీధిలోకి వెళ్లిపోయాడు.

నా లేతకళ్లతో పెళ్లిపందిరితో ఈ ఇల్లు చూశాను మామిడాకుల తోరణాల కింద పరుగులెత్తాను ఇప్పుడు—

ఈ పదేళ్ల కాలంలో సంఘ మెంత మారిపోయిందని! మా పూర్వీకుల నివాసం విజయనగరం. ఆంధ్రరాష్ట్రం వచ్చిన కొత్తలో అన్నయ్యకి సెక్రటేరియట్‌లో ఉద్యోగం వచ్చింది. కర్నూలులో చేరాడు. తర్వాత హైదరాబాద్. వాడి ఆరోగ్యం బాగా లేదని అమ్మా నాన్నా వెళ్లారు. తర్వాత ఏడు నన్నూ, అమ్మమ్మనూ తీసుకుపోయారు. అమ్మా నాన్నా హైదరాబాద్ వెళ్లిన ముందటేడు శకూ అక్క పెళ్ళయింది. బావ బాగా చదువుకున్నవాడు. శ్రీకాకుళం జిల్లా. వందన్నర ఎకరాల ఆస్తి. అగ్రహారం భుక్తలు. వాళ్ల ఇళ్లు జమీందార్ల ఇళ్లల్లా ఉండేవి.

అప్పట్లో శకూ అక్కకి ఈ సంబంధం కుదిరిందంటే కారణం శకూ అక్క అందం. శకూ అక్కపాట. వాళ్ళ స్థాయిలో పెళ్లి చేయటానికి పల్లెటూళ్లో ఉన్న అయిదెకరాల భూమి ఆ చవక ధరల్లో మేము అమ్మకోవాల్సి వచ్చింది. ఆడపిల్ల ఒక్కతేకాబట్టి దాని పెళ్లికి ఏలోటూ చేయకూడదని అమ్మ నాన్న అన్నయ్య పట్టుబట్టి ఘనంగా చేశారు.

కొన్నాళ్లకు పరిస్థితులు మారాయి. కిందకోర్టులో ఇనామ్‌దారీ వివాదాల్లో గెలుచుకున్న భూములు పైకోర్టులో రైతులు గెలుచుకున్నారు. ఒకప్పుడు బాగా బతికిన కుటుంబం అవటంవలన దెబ్బ తిన్నారని విన్నానేగాని ఇంటికి కనీసం వెల్ల వేయించుకోలేని ఈస్థితికి దిగజారిపోయారని, శకూ అక్క ఇంత దుర్భరజీవితాన్ని భరిస్తున్నదని తెలీదు.

పెళ్లిపేరుతో శకూ అక్కని ఇటు విసిరేసి బతుకు ఆశతో హైదరాబాద్ పారిపోయాము. వారసుడయిన కొడుకుకోసం, మిగిలిన ఈ ఇల్లూ ముప్ఫయి ఎకరాల భూమికోసం అక్కని ఈ గుహల్లో మరచిపోయాము. బావ పోయినప్పుడు అయిదేళ్ల క్రితం అమ్మ, నాన్న అన్నయ్య వచ్చి చూసారు. ఈ బాధ చెప్పలేదు. నాన్న ఉత్తరాలు రాస్తుంటాడు ఎప్పుడూ ఈ దయనీయ జీవితం గురించి రాయలేదు. బహుశా వాళ్ల దృష్టిలో ఇవి కష్టాలు కావేమో. ఈ కష్టాలనించి గట్టెక్కించేందుకు అశక్తులేమో వాళ్లు.

ఆ రాత్రంతా నిద్రలేదు. అక్కను ఏదో మిషపెట్టి తీసుకుపోవడం తప్ప వేరే ఉపాయం తోచలేదు. మామగారితో నాన్నగారి అనారోగ్యం గురించి చెప్పి ఒప్పించి అక్కనీ సుభాష్‌నీ తీసుకుపోవాలి.

* * *

బ్రాంచి పోస్టాఫీస్ నించి దినపత్రిక తెచ్చి మామయ్యకి ఇవ్వటం సాంబం పని. ఆ తెచ్చే దారిలో సినిమా బొమ్మలు చూస్తాడు. వంశపారంపర్యమైన చర్మరోగమేదో సాంబంకి ఉంది చర్మంలో తడి కనిపించదు. పొడిబారిపోయి బూడిద పూసుకున్నట్టు ఉంటుంది ముఖంమీద, శరీరమంతటా సన్నటి నూలుపోగుల్లాగ పగుళ్లు. మెడ పొట్టిది తలకాయ భుజాల మీద పడుతుంది. అల్పమైన మనిషి.

పంచాయితీ లైబ్రరీనించి తను తీసుకెళ్లిన కాశీమజిలీ కథలు ఇవ్వటానికి ఉదయం వచ్చినప్పుడు పరిచయం. టీచర్ ఉద్యోగం కోసం పాట్లు పడుతున్నాట్ట. ఆరోగ్యంకోసం శ్రద్ధ తీసుకోమని చెపితే 'ఉద్యోగంలో చేరితే మందులు వాడుకుంటాను బాబుగారూ' అని జవాబు చెప్పినప్పుడు సాంబంమీద జాలేసింది.

ఉదయం మామయ్య నాగురించి కనీసం ఓ పదిమందితోనన్నా, వాళ్లు అడక్కపోయినా 'శకుంతలమ్మ తమ్ముడు; ఢిల్లీలో ఎనిమిదొందల రూపాయల ఉద్యోగం. ఐ ఎ ఎస్ ఆఫీసర్ అంటే కలక్టరవుతాడన్నమాట' అని అబద్ధాలు కలిపిచెప్పాడు. ఒకప్పుడు ఇంగ్లీషు కలక్టర్లు ఎంతతరచుగా తనని చూట్టానికి వచ్చేదీ చెప్పి అదే గొప్పతనం తనకి ఇప్పుడూ ఉన్నట్లుగా నాతో మాట్లాడుతూ వాళ్లతో ఓపాతికశాతం అబద్ధాలు చేర్చిచెప్పాడు మామయ్య మాటలు విన్న సాంబం మరింత భక్తివినయత చూపించాడు చేతులు నులుముకుని కిందమెట్టు మీద కూచున్నాడు

మనదేశానికి ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి. రాష్ట్రపతి కామరాజ్ నాడార్. మన దేశంలో ప్రధాన భాష తెలుగు. మళ్ళీ ఇంగ్లీషు వాళ్లొస్తేనేగాని ఈ దేశం బాధలు తప్పవట.' ఇదీ సాంబం చదువు. సర్వీస్ కమీషన్ పరీక్షల్లో వచ్చిన వింత జవాబులు. టీచర్ ఉద్యోగం తప్పించి ఇంకేదన్నా వెతుక్కోవడం మంచిదని చెప్పాను.

స్వరాజ్యం వచ్చిన ఇరవైయేళ్ల తర్వాత కూడా ఆ ఊళ్లో అర్థం కాని విధానముంది. ఒకప్పుడు ఆ ఊళ్లోని రైతులంతా మామయ్య పొలంలో పనిచేసే కంబార్లు. శూద్రులు, బ్రాహ్మణులంటే సనాతనంగా ఏర్పడిన భక్తి, గౌరవం. ఎడంగా ఉంటారు సెకండరీ ట్రెయినింగ్ చదువుకున్న సాంబం కూడా 'బాబూగారూ', 'తమ ఆశీర్వాదం' అంటి మాటలు ఉపయోగించి తనని తనే చిన్నబుచ్చుకునేవాడు. ఇప్పటికీ సాంబం కులంవాళ్లు చాలామంది రైతులు దగ్గర కంబార్లుగా ఉన్నారు.

ఆ రోజు సాంబంని తోడు తీసుకుని సముద్రం చూట్టానికి వెళ్లాను సముద్ర

మంటే శకూ అక్కకి ఎంతో ఇష్టం. వైజాగ్ వదినగారింటికి వెళ్తే మహారాణి పేట బీచ్‌లో పరుగులు తీసేది. నాకు బాగ గుర్తు 'వాళ్ళూరుకు (బావగారి) సముద్రం చాలా దగ్గరట' పెళ్ళిచూపుల తర్వాత అక్క నాతో చెప్పటం. పెళ్ళయిన తర్వాత — మొట్టమొదటిసారి ఇక్కడికి వస్తున్నప్పుడు — చీకటిరాత్రి — పల్లకిలో కూచుని నిద్రమత్తుతో ఊగుతున్న నన్ను లేపి మా ముందువెనకల వస్తోన్న ఇరవై ముప్ఫయి ఎడ్లబళ్ల గంటల మోతలో 'తమ్ముడూ, ఆ సముద్రపు మోత విను. విన్నావురా' అని చెప్పటం నాకు బాగా గుర్తు. సంక్రాంతి పండక్కి బావతో వచ్చినప్పుడు 'ఆరుసార్లు సముద్రానికి వెళ్ళాను. బావగారు అయిదుసార్లు తీసు కెళ్ళారు. గ్రహణ స్నానాలకి ఒకసారి' అని స్వర్గం చూసిన ఆనందంతో శకూ అక్క చెప్పటం మరచిపోలేను.

కెరటాలు హోరున విరుచుకుపడి వైశాఖాలువరకూ తడిసి వెనక్కి మళ్లి పోతున్నాయి. సముద్రపు పిట్టలూ నీటి కాకులూ పద్మున ఎగురుతూ సముద్రపు పురుగుల్ని ఏరుకుంటున్నాయి తూర్పున చూపు పరుగెత్తేంతదూరం బంగాళాఖాతం పడమట వెడల్పాటి ఇసిక మేటలు. మధ్య మధ్య మంచినీటి నెలమలు. సముద్రపు ఒడ్డంతా పంచవర్ణ ప్రణాళికల భాగంగా పెంచిన కొన్నివేల ఎకరాల సరుగుడు తోటలు. ఆ తోటలకూ సముద్రానికీ మధ్య మారు దక్షిణంగా ముదురు బూడిద రంగు పెంకుటిళ్ళల పల్లె. ఆ పల్లె సమీపంలో పడవలు. ఆకాశంలోకి లేచిన జండాలు.

'ఇంక ఇక్కడ కూచుందాం' అని ఆగేను.

వొద్దు తలూపి 'అటు పదండి బాబు గారూ' అన్నాడు సాంబం.

'ఏం!' అంటే —

చేపలమ్ముకునే ఒక తురకఖ్బాయి మోజులోపడి సాంబం కులంపిల్ల గర్భం తెచ్చుకుని సముద్రంలో పడి చనిపోయిం దింట. నేను కూచుందామన్నచోట ఆపిల్లను పాతారంట.

ఒక్కొక్క ఇసిక రేణువు ఒక్కొక్క కథ చెప్తుంటాయక్కడ.

ఆ పల్లెను ఓ ఫర్లాంగు దూరాన నేను సముద్రానికి ఎదురుగానేను, సాంబం సరుగుడు

# కుంకుమ

తోటలకి ఎదురుచేసి ఎదురెదురుగా కూచున్నాం.

సాంబంతో మాట్లాట్టం సరదాగా ఉంది. తల్లీ తండ్రీ లేరట. వాళ్ల మామ పెంచా డట. చిన్నతనంలో తల్లిదండ్రుల ప్రేమను కోల్పోయిన వాళ్లమీద నాకు ఒక అభి ప్రాయముంది. వాళ్లు సామాన్యంగా పిరికి వాళ్లవుతారు. లేదా క్రూరులవుతారు. సాంబం పిరికి గొంతుకు ఇదొక కారణ మయ్యుండాలి. తండ్రి ఆస్తి నాలుగెకరాలు ఉందంట. ఆ భూమి సావుకారు అప్పు తీర్చటానికి అమ్మేయాల్సి ఉంటుందంట. అప్పు తీర్చమని, లేకపోతే కోర్టుకు వెళ్తా నని భయపెడుతున్నాడు. ఎవరూ కొనకుండా చేసి భూమికి ధర రానియ్యటంలేదు అని సొంత బాధలు చెప్పుకున్నాడు.

జమీందారు నించి భూమి రైతుకిచ్చి ప్రభుత్వం ఏం మేలుచేసింది. అప్పు లిచ్చే సావుకారు చేతుల్లో పెట్టింది. ఈమాత్రా నికే దున్నేవాడికే భూమి అని ప్రచారం, జమీందారీ రద్దు అని శాసనం ఎందుకో తెలీదు. ఈ ఇనాందారీ రద్దు రాకపోతే శకూ అక్కదశ ఇట్లా ఉండేది కాదు.

ఆ పల్లెనించి మావేపు రంగుదుస్తుల పేంట్ మార్కు కుర్రాడు వస్తోంటే సాంబం చూసి, లేచినిలబడి చప్పట్లుకొట్టి కేకేసి పిలిచాడు. 'చేపల ఇనస్పెక్టరండి బాబుగారు మా దొడ్డమనిషి' అన్నాడు నాతో సాంబం.

'మనూర్లోనే తమ మామయ్యగారింటిలో పంచాయితీబోర్డు పక్కగదిలో ఉండేవాడు తమ కులమే. ఆరేడు నెలలయింది పక్క ఊరెళ్ళిపోయి' చెప్పి అటు ఆయన వస్తున్న వేపు చూసి 'సుధాకరరావు అంటారు. పాట లంటే చెవి కోసుకుంటాడు. నాటకాలంటే ఎంతదూరమన్నా ఎళ్లి సూసొస్తాడు.'

సాంబం అడక్కుండానే చాలా వివరాలు చెప్పాడు.

సుధాకర్రావు అంతదూరం నించే 'సరు గుడు తోటలోదిలేసి ఇలా దిగబడ్డావేం' అని నావేపు కొత్తగా చూసి, చూపులు తిప్పుకుని నీ దగ్గర ఈరోజు మకాం అను కున్నా కాని ప్రెసిడెంటుగారు కందాకి చెప్పారు. రావటం మానేసానని విచార.'

అంటూ ఇసికలో కూలబడ్డాడు.

'సుభాష్ బాబుకి మామయ్యగారు' అని పరిచయంచేసి నా గురించి చెప్తున్నాడు సాంబం.

'అంటే శకుంతలమ్మగారి—'

'తమ్ముణ్ణి' అన్నాను.

'ప్రెసిడెంట్‌గారు మీ గురించి చెప్పా రొకసారి' అన్నాడు సుధాకర్రావు

అతడి చూపుల్లో నా దగ్గర స్నేహితులు గుర్తుకొచ్చారు. ఎదటివాళ్ళ మంచితనాన్ని నమ్మి మాటాడే గొంతు. శ్యామల గుర్తు కొచ్చింది.

నా పేరు వెనక ఉన్న ఐ ఎ ఎస్ గురించి చెప్పాడు. ఆ అక్షరాల బరువు మామయ్య ఇచ్చిన అంకెలతో చెప్పాడు సాంబం.

'మీరు బాగా పాడతారని—'

తన కళని ఇతర్లు గుర్తించినప్పుడు కలిగే ఆనందంతో నవ్వు. ఉంగరాల జుత్తు. చందనం రంగు శరీరం. ఉన్న జీవితానికి శాంతించగల కళ్ళు.

ఇసికలో పడుకున్నాను.

మల్లేశ్వరిలోని ఆకాశవీదిలో పాడేడు. కొండగాలి వీచింది పాడేడు. చుక్కలన్నీ కొండమీద పాడేడు. యెలుతురంతామేసి పాడేడు.

వెల్లకిలా పడుకుని చూస్తున్నాను.

ఇదే పెన్నపాడేడు. మాట్లాడని మల్లె మొగ్గపాడేడు. క్షేత్రయ్య పదం పాడేడు. జానపద గేయం రాజారమ్మన్నాడు పాడేడు.

అక్కడ సంగీతం శృంగారమయింది. శృంగారం యవ్వనమయింది. యవ్వనం పరిమళ మయింది. పరిమళం సాగర సమీరమయింది. సాగర సమీరం ఆత్మత ఆక్రందనయింది. ఆ ఆక్రందన అంగాంగాల్లో పరుగు తీసింది.

పక్కకి తిరిగి సముద్రాన్ని చూశాను. సహస్రకోటి తంత్రువుల వీణమీద పవనుడి వేళ్ళు నాట్యమాడుతున్నాయి.

సాంబం సరుగుడు తోటల కేసి చూస్తున్నాడు. శూన్యంలోకి చూస్తున్న సుధాకర్రావుని చూశాను. నాకంటే ఒకటి రెండేళ్ళు పెద్ద అండొచ్చు. యవ్వనం సంస్కారంతోనూ, సాధుత్వంతోనూ కళాత్మ కంగా ఉంది. అతడి యవ్వనానికి కోరికల ముదురు రంగులేదు ఉద్రేకం వేడి తక్కువ.

# సైంటిస్టులు

## నొప్పిని __అతి__ __శీఘ్రంగా__ తొలగించునట్టి విధానమును

# కనుగొన్నారు



# మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో'

**ఇప్పుడు, మొదటిసారిగా భారతదేశంలో ప్రవేశపెట్టబడినది**

**బాధ మా సమస్య:** "ఆస్ప్రో" యొక్క పరిశోధన సంస్థలో, బాధ యొక్క సమస్య మీద పని చేస్తున్న సైంటిస్టులు ఇప్పుడు, క్రొత్త మైక్రోఫైన్డ్ ఆస్ప్రోను కనుగొన్నారు—ఇది బాధను అతి శీఘ్రంగా పోగొట్టే సాధనము.

**మైక్రోఫైన్డ్ అంటే ఏమిటి:** మైక్రోఫైన్డ్ అంటే, ఆస్ప్రోలోని నొప్పిని పోగొట్టే పదార్థము ముప్పది రెట్లు సన్నగా క్రొత్త ప్రత్యేకమైన పద్ధతిలో చెయ్యబడినది. ప్రతి మాత్రలోను ఇప్పుడు ఇంచుమించు 15 కోట్ల అతి సూక్ష్మమైన అణువులు వుంటాయి. అందువలన, రెండింతల కన్నా ఎక్కువగా నొప్పిని పోగొట్టే శక్తి అతి శీఘ్రంగా పని చేసి, మూడు రెట్లు శీఘ్రంగా నొప్పిని తొలగించును.

**అతి శీఘ్రంగా పని చేస్తుంది-చాలా సేపు వుంటుంది:** క్రొత్త మైక్రోఫైన్డ్ ఆస్ప్రోలోని చురుకైన పదార్థము సునాయాసంగా, అతి త్వరగా ఇమిడి శరీరమందు 5 నుండి 7 గంటల దాకా వుంటుంది. ఇందువల్లనే, మైక్రోఫైన్డ్ ఆస్ప్రో అతి శీఘ్రంగా నొప్పిని తొలగిస్తుంది, మరియు చాలా సేపు వుంటుంది.

**తీసుకోవడం చాలా సులభము:** క్రొత్త మైక్రోఫైన్డ్ ఆస్ప్రోను మీకు ఇష్టమైనట్లు తీసుకోవచ్చును. అలాగే కాని, నీళ్లలో కలిపి కాని, ఒక గ్లాసుడు నీళ్లలో కాని, లేక వేడి పానీయముతో కాని తీసుకోవచ్చును.

**వీటికోసం క్రొత్త మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో'ను వాడండి:** నొప్పి, తల నొప్పి, ఒళ్లు నొప్పి, పంటి పోటు, కీళ్ల నొప్పి, జ్వరముతో కూడిన జలుబు, ఫ్లూ, కీళ్ల నొప్పులతో కూడిన జ్వరము, గొంతుగనొప్పి.

**మోతాదు:** పెద్దవారికి: రెండు బిళ్లలు, అవసరమైతే మళ్లీ వేసుకోండి. పిల్లలకు: ఒక బిళ్ల, లేక డాక్టర్ సలహా ప్రకారము వేసుకోవలెను.

**క్రొత్త మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో' ఈ విధంగా పనిచేస్తుంది**



బిళ్లలోని అణువు ఎంత పెద్దదిగా వుంటే అంత నెమ్మదిగాను అది ఇముడుతుంది—అందువల్ల మీరు, నొప్పి తగ్గడానికి చాలా సేపు ఆగాలి.




ఇది మైక్రోఫైన్డ్ చెయ్యబడుట వలన, ప్రతి, క్రొత్త మైక్రోఫైన్డ్ ఆస్ప్రో, బిళ్లలోను ఇంచుమించు 15 కోట్ల అతి సూక్ష్మమైన అణువులు వుంటాయి. ఇందువలన, ఇవి అతి త్వరగా ఇమిడి, అతి శీఘ్రంగా నివారణ నిచ్చును.

క్రొత్త మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో', నొప్పిని, నివారించుటకు, ఇప్పుడు మీకు లభించే వాటిలో అతి ఆధునికమైన సాధనము.








మైక్రోఫైన్డ్

**ఆస్ప్రో**

__అతి శీఘ్రంగా__ నొప్పిని తొలగించును

నికొలస్ ఉత్పత్తి

# కుంకుమ

కళ్ళల్లో త్యాగం చేసి పోగేసుకున్న తెల్ల తామరెక్కువ. కన్నీటి చినుకులకు కరిగి పోయే కాటుకలాంటి లేతమనసు.

తిరిగి వస్తున్నప్పుడు సరుగుడు తోట మధ్యలో ఉండగా 'తమరు వెళ్తాండండి' అని ఇసికలో ముత్యాలనో, ఆరుద్రపురుగులనో వెతుక్కుంటున్నట్టుగా చూస్తూ ఉత్తరంగా వెళ్ళిపోయాడు సాంబం.

కొంచెం ముందుకి నడిచినాకా 'అడుగులు కన్పించివాయి' అన్నాడు సుధాకర్రావు.

అర్థం కాలేదు నాకు.

'ప్రేమ' అన్నాడు ఈసారి. చెట్ల మానుల చాటులో సాంబం తప్పిపోయిన వేపు చూస్తున్నాడు సుధాకర్రావు.

ప్రియురాలు సరుగుడు పుల్లల మోపం మీద వచ్చిందట. అడుగుజాడ వెతుక్కొని సాంబం.

శ్యామలని కలియటానికి నాకు కళా భవన్‌లో ఎగ్జిబిషన్లూ, భాషా నిలయంలో ఉపన్యాసాలూ, వై ఎమ్‌సి ఏలో సభలూ, రవీంద్ర భారతిలో నృత్యాలూ నాటకాలూ, జూబిలీ హాల్లో, మాక్స్‌ముల్లర్ భవన్‌లో, అమెరికన్ కల్చరల్ సెంటర్లో సాంస్కృతిక కార్యక్రమాలు మా సంకేతాలు.

చర్మరోగం ఉన్న సాంబం ప్రేమ ప్రమాదకరమైనది. జాతికీ, సంఘానికీ ద్రోహం.

'ఆ అమ్మాయితో ఈ మాఘంలో పెళ్ళి లెండి'

ఈ మాట మరింత కటువుగా ఉంది నాకు.

'తండ్రి చిన్నప్పుడే పోయాడు పాపం. మామ పెంచాడు. ఆయనే ఈ పెళ్ళి చేస్తున్నది.

సుధాకర్రావు మాట వింతగా విన్పించింది. తల్లీ తండ్రీ చిన్ననాడే పోయినట్టు సాంబం ఇప్పుడే చెప్పాడు. తండ్రి మాత్రమే పోయినట్టు సుధాకర్రావు చెప్తున్నాడు.

'తల్లి కూడా పోయింది కదా?'

'పల్లెకులంలో మారు మనువుంది. భర్త పోయిన కొన్నాళ్ళకి ఆమెకు రెండో పెళ్ళి చేసారు. ఆమె అదిగో ఆ పల్లెలో. తల్లికి రెండో పెళ్ళి సాంబంకి చిన్నతనం. నాతోకూడా మొదట ఇదే అబద్ధం చెప్పాడు. అడక్కుండానే తల్లీ తండ్రీ పోయారని చెప్తాడు. అట్లాగే చెప్పాడు కదా మీతో?'

'అవును'

నేను సాంబాన్ని క్షమించలేక పోయాను.

నాతోపాటే సుధాకర్రావు ఇంటికి వచ్చాడు.

* * *

పంచాయితీ కార్యాలయం అని రాసిన బోర్డున్న గది దగ్గర వరండాలో, పూర్వ కాలపు హోదాను గుర్తుగా ఉన్న నగిషీ చెక్కిన కుర్చీలో మామయ్య కూచొనున్నాడు. తూర్పువక్క రాటకి చేరగిలబడి నుదుట పొడవాటి కుంకుమ బొట్టున్న మెలి తిరిగిన మీసాలున్న ఏళ్ళు ముదిరినాయన కూచొనున్నాడు. ఆయన చెవులకి బంగారపు గుళ్ళు వేలాడుతున్నాయి. వీపు మీదికి జుత్తు వేలాడుతోంది. అక్కడ టీ తాగేకి ఉంచిన రెండు వెండిగ్లాసు లున్నాయి.

మొత్తం ఆ భవనం దక్షిణంగా ఎదురు చేసి ఉంటుంది. ఆ ఊళ్ళో ఆ భవనం ముళ్ళ తుప్పల మధ్య ఆకురాల్చిన మహావృక్షంలా కన్పిస్తుంది.

వాకిట్లో మేముండగా చాల ఆప్యాయతతో మామయ్య సుధాకర్రావుని పిలిచి కూచోమన్నాడు. సుధాకర్రావుతో మామయ్య మాటాడుతోంటే నేను లోపలి కెళ్ళాను.

వెలిగించిన అరికెన్ లాంతరు తెచ్చి గదిలో గుజానికి వేలాడేసి పెట్టి పనివాడు వెళ్ళిపోయాడు.

'ఎక్కడికెళ్ళావురా?' అడిగింది శకూ అక్క.

'సముద్రానికి' అన్నాను.

శకూ అక్క కొంతసేపు ఆపుకోవాలని ప్రయత్నం చేసి శక్తి చాలక కట్టలు తెంచుకున్న కెరటాలతో మళ్ళీ ఏడ్చింది.

బావ పోయాడన్న బాధ. అమ్మ, నాన్న, అన్నయ్య తమ్ముడు దూరం చేసారన్న బాధ. తనకి ఏదో కావాలన్న బాధ. ఎవరో లేక పోయారన్న బాధ. అందరిలా తనని బతక నివ్వడం లేదన్న బాధ. తనబాధ ఎవ్వరికీ ఎందుకు అర్థం కావడంలేదన్న బాధ. అర్థమయి కూడా తనని రక్షించటం లేదన్న బాధ. ఆ బాధలన్నీ గుండెను పిండుతోంటే ఏడుస్తోంది.

నాలుగేళ్ళ కితం — నా చదువులకి, నాన్నగారి డైబిటిస్‌కీ, వదిన కాన్పులకీ, చిన్న

పిల్లల జబ్బులకి డబ్బు చాలక అప్పు పుట్టక బాధ పడుతోంటే శకూ అక్కకి ఒక ఉత్తరం రాశాను. డబ్బు ఏమన్నా పంపించమని. అక్క రెండొందలు పంపింది. శకూ అక్క పంపించిందని అన్నయ్యకు ఇవ్వబోతే తిట్టాడు. అప్పుడు శకూ అక్క ఆ డబ్బు ఎట్లా పంపించిందో తెలీదు. ఈ ఆస్తికీ, ఈ సంపన్నతకీ అధికారిణి. సుభాష్ వారసుడు. వాడిని పెంచి పెద్ద చెయ్యాలి. అదీ నా ఊహ. కాని శకూ అక్క చేతుల్లోకి డబ్బు రాదు. నరుగుడు తోటలు 'మీద, పొలంమీద చాలా అప్పులున్నాయి. బంగారం చాలా మురిగిపోయింది. అన్నయ్య అప్పుడు ఎందుకు తిట్టాడో ఇక్కడ అర్థమయింది. ఒక్కదగ్గర మాత్రం నా ఊహ తప్పుకాలేదు. శకూ అక్క చీపురుపుల్ల కూడా ముట్టుకో అక్కరలేదు చాలామంది పనివాళ్ళున్నారు. వాళ్ళే చేస్తారు.

శకూ అక్కకేం కావాలో నాకు తెలుసు. నుదుట కుంకుమ. మహానగరాల్లో శకూ అక్క వయసువాళ్ళ జీవితంలోని తీయని ఆశలతో, ఉన్నతమైన ఆశయాలతో, చేతి నిండా పనితో, అందమైన జీవితంలో కని పించినపుడు శకూ అక్క స్మృతి మెరిగేది. శకూ అక్క ఆస్తి ఏళ్ళల్లో ఎంతమందికి ఉంటుంది అనుకునేవాడిని. కాని చిటికెడు కుంకమని కూడా నుదుట పెట్టుకోలేని శకూ అక్క పేదరికాన్ని ఊహించనన్నా లేదు.

పెంబిం తల్లికి పెళ్ళిచేసిన ఆ తల్లి దండ్రులు తెలివైనవాళ్ళు. అది నీతిగా, ధర్మంగా అంగీకరించిన ఆ కుల పెద్దలు వ్యక్తి అవసరాలని గుర్తించగలిగారు. తమ బాధ్యతను నిర్వర్తించుకున్నారు. కుటుంబ గౌరవం, కులధర్మం, భర్తమీద అనురాగం, మాతృప్రేమ—ఇవన్నీ బయటికి చెప్పుకునే పచ్చి అబద్ధాలు ఇంతకంటే సతీ సహగ మనం నయం నిలువవేసి చంపడం న్యాయం. ఉరికంబాలికి ఎక్కించడం సుఖం.

శకూ అక్క ఏడుపు విని మామగారు లోపలికొచ్చాడు. ఆయనతో నుదుట పొడవాటి కుంకుమబొట్టున్న మెలితిరిగిన మీసాల ఏయిసు మళ్ళీనాయన వచ్చాడు.

ఆయన శకూ అక్కదగ్గరకొచ్చి ఒక చేత్తో భుజంపట్టి, నడినెత్తిమీది జుత్తు పాయతీసి, అక్కనుదుట కుంకుమపెట్టి కళ్ళల్లోకి తీవ్రంగాచూసి, 'ఎవరు నువ్వు ? నీ పేరేమిటి ?' అని భయపెట్టే గొంతుతో అడుగుతోంటే మొదట నాకు అర్థం కాలేదు. శకూ అక్క మాటాడలేదు.

ఆ ఊళ్ళో, చేపలమ్ముకునే తురకబ్బాయి మోజులోపడి ఒక శూద్రపుపిల్ల గర్భం తెచ్చుకుని సముద్రంలోపడి చనిపోయిందట. అది దయ్యమయి శకూ అక్కను పట్టుకుని 'సముద్రం' 'సముద్రం'అని కేకలేస్తుందట. మొట్టమొదటిసారి ఆ దయ్యం పట్టుకున్నప్పుడు కత్తిపట్టుకుని శకూ అక్క పెరట్లోని పూల మొక్కల్ని ఒక్కటి మిగల్చకుండా నరికేసిందట. పూల కుండీలన్నిటినీ విరగ్గొట్టేసిందట. నిన్నటినుంచి శకూ అక్క ఏడుపుతో మామయ్యకు అనుమానం కలిగి భూతవైద్యుణ్ని రప్పించాడు.

ఆ భూతవైద్యుడు పళ్ళికిలించి కటువుగా 'ఎవరు నువ్వు?' అని పట్టుకున్న శకూ అక్క జుత్తు పాయను బిగిస్తున్నాడు. ఇంకా ఏమిటేమిటో చేసేట్టున్నాడు. శకూ అక్క మొదట్లో తప్పించుకునే ప్రయత్నం చేసి తర్వాత నా వేపు చూసి మానుకుంది. మాటాడలేదు. ఇట్లా మాటాడకపోవడం, ఏడ్వడం, తొందరగా జవాబు చెప్పకపోవటం తురకబ్బాయి మోజులో పడ్డ శూద్రపుపిల్ల దయ్యం లక్షణాలట! మొండిదట

'ఇదిగో ముందు ఆ జుత్తు విడిచిపెట్టు' అని అరిచాను. ఆ భూతవైద్యుడు వినిపించుకోలేదు. నా గొంతు విని నన్ను చూసి జడిసి మామయ్య వెనక్కి తప్పుకున్నాడు.

చుట్టూ చేరిన మనుషుల గుంపుని చీల్చుకుంటూ 'విడిచిపెట్టు' అని గట్టిగా అరచి బలవంతంగా వాడిని బయటికి నెట్టాను. 'వెళ్ళండి' అని బిగ్గరగా అరిచాను. ఒకరిద్దరు నన్ను ఆపబోతోంటే వాళ్ళని విదిలించుకున్నాను. వాళ్ళ నక్కడ తన్నాలన్నంత ఉద్రేకం కలిగింది. అంతా అక్కణ్నుంచి వెళ్ళిపోయారు.

ఈ గొడవకి సుధాకరరావు వచ్చాడు.

పెంబని తీసుకురమ్మని ఆయన్ని పంపించాను.

శకూ అక్క పిచ్చిగా కూచుంది మంచం మీద. జరజరా కన్నీళ్ళు కళ్ళల్లోంచి జారి పోతున్నాయి.

నా గొంతు చల్లారింది. 'సుభాష్ ఎక్కడుంటాడు?' అడిగాను.

కొంచెంసేపు నన్నుచూసి 'ఇలా చంపుతున్నారా' అంది మళ్ళీ కన్నీళ్ళు. మళ్ళీ వెక్కి వెక్కి లోలోపల కుక్కుకుంటోన్న దుఃఖం

'ఏడవ్వొద్దక్కా' అంటున్నానేకాని ఏడవటానికక్కడ స్వేచ్ఛలేని అక్కడ శకూ అక్క భరిస్తోన్న శిక్ష నాకు అర్థమవౌతోంది.



# కుంకుమం

'సుభాష్ ఎక్కడుంటాడు?' మళ్లీ అడిగాను.

కన్నీటి పెదాలతోనే 'దేవాలయందగ్గర' తీసుకురమ్మని ఇంట్లోని కంబారిని పంపించాను.

'ఇప్పుడు మనం వెళ్లిపోవాలి. నువ్వు తయారవక్కా.'

నా చొక్కాలూ అవీ బేగ్‌లో సర్దుకున్నాను.

అక్క అట్లానే ఆ పొట్టిమంచం మీది నించి కదలక చూస్తోంటే 'మనం వెళ్లిపోవాలి' అని 'ఇంతకీ నీకు ఇష్టమున్నట్లా లేనట్లా? నువ్వవస్తావా?' అని అడిగాను.

అట్లాంటి నా ప్రశ్న ఎంత బాధిస్తుందో కూడా నాకా సమయంలో తోచలేదు.

'ఆఁ' అంది.

'మరి తయారవు. సాంబం వస్తే బండి ఏర్పాటు చేయిస్తాడు'

శకూ అక్క లేచి చిన్న ట్రంకుపెట్టె సర్దుతోంది.

సుధాకర్రావు వచ్చి 'సాంబం ఇంకా రాలేదు' అన్నాడు.

*　　*　　*

సుధాకర్రావే బండి ఏర్పాటు చేయించాడు. మాకు తోడుగా వచ్చాడు. సుభాష్‌ని రానివ్వలేదు. పెద్ద పోట్లాటయింది. అయినా శకూ అక్కను అక్కడుంచదలచలేదు.

సుభాష్‌కోసం ఏడుస్తోంది.

శకూ అక్క ఏడుస్తోంటే నాక్కోపం.

కొంచెంసేపు వాళ్లతోపాటు ఓదార్పు కబుర్లు చెప్పిన సుధాకర్రావు గొంతు మధ్యలో ఆగిపోయింది. 'ఏమిటి మాటాడరేం?' అని ముఖం తిప్పబోతే చేతికి చల్లగా కన్నీరు.

'ఎందు కేడుస్తున్నారు? ఎందు కేడుస్తున్నారు?' అంటే.

'రెండేళ్లు ఈ చిత్రహింస చూశాన్నేను. కాని రక్షించలేకపోయాను. నేను పరాయివాడిని. రక్షించే అధికారంలేదు. హక్కులేదు తమ్ముడు మీారు. ధైర్యంగా ఎదిరించి తిట్టి ఆ క్రూరహింసలనించి రక్షించగలిగారు. తమ్ముడంటే, అన్నంటే, నాన్నంటే,

అక్కంటే, భార్యంటే, కొడుకంటే అధికారాలు పొందడం, ఒకరిమీద ఒకరు అధికారాలు పొంది ఒకర్నొకరు రక్షించుకోవడం.'

అందుకేనా సుధాకర్రావు కన్నీరు పెట్టుకున్నది?

'నేను ఏమీ చెయ్యలేక, ఆ పక్కగదిలోనే ఉండి ఆ బాధలు చూడలేక అక్కయ్యని తప్పించుకుని పారుగూరు వెళ్ళిపోయాను. ఎందుకట్లా హింసిస్తున్నారని ఏ అధికారంతో అడగ్గలను? దానికి తోడు నా వయసు'

సొంత దుఃఖంలో శకూ అక్క.

ఎడ్లగంటల గణగణ మోత. బండి చక్రం రాళ్లమీంచి నడుస్తున్న శబ్దం. ఎద్దుల అడుగుల క్రమబద్ధమైన లయ. బండి యిరుసు కిర్రుకిర్రు రాగం. సముద్రపు హోరు. చల్లగాలి.

సుధాకర్రావు గొంతు శకూ అక్క వింటో లేదో.

బలహీనమైన గొంతుతో ఏడుస్తోనే ఉంది.

'రావటం ఇష్టంలేదా?' అని అడిగితే నోరు విప్పదు.

మాతృప్రేమ అట్లాంటిది. నిజమేకాని మనిషి సొంతబాధలనించి తప్పించుకోవటం కంటే ఏ ప్రేమా, ఏ బాధ్యతా గొప్పది కాదు. ప్రేమనే, బాధ్యతనే మనిషి లెక్కిస్తే పిల్లల్ని విడిచిపెట్టి ఆత్మహత్యలకి తెగించడాలూ, సంసారాలని వొదిలేసి సన్యాసుల్లో చేరిపోవడాలూ, తల్లీ తండ్రిని మరచిపోయి పారిపోవడాలూ ఉండేవికావు. అక్కడ ఊపిరాడని ఆ చీకటి గుహల్లో ఉంటం అక్కకి ఇష్టంలేదని భాషతోకాక కన్నీటితో చెప్పింది. మామగారికి సుభాష్ కావాలిగాని శకూ అక్క అక్కర్లేదు. కాని నాకు శకూ అక్క కావాలి.

వేకువజాముకి మా బండి జంక్షన్ చేరుకుంది. మాతోపాటు స్టేషన్‌వరకూ వస్తానన్న సుధాకర్రావు బస్సు వచ్చినప్పుడు 'నేను ఉంటాను' అంటూ ముఖం తిప్పుకున్నాడు. బస్సు పరుగు హెచ్చిన కొద్దీ సుధాకర్రావు చిన్నవయి, ఇంకా చిన్నవయి చివరికి అక్కడి నేలరంగులో, అక్కడి ఆకాశం రంగింలో కలిసిపోయాడు. ●



ఒకసారి

కాదు— రెండుసార్లు

కాదు— మూడుసార్లు

కాదు— వందసార్లు— వెయ్యిసార్లు— లక్షసార్లు— నిన్ను తిడతాను. నే తిడతాను నిన్ను నే తిడతాను.

నాకు హక్కుంది. తిట్టడానికి హక్కుంది. నిన్ను నే తిట్టడానికి హక్కుంది.— నాకు హక్కుంది.

నువు ఆఫీసుకి వస్తే తిడతాను. రాకపోతే తిడతాను. పని అసలు చెయ్యకపోతే తిడతాను. సరిగా చెయ్యకపోతే తిడతాను. ఆఫీసులో నువ్వు నిద్దరోతే తిడతాను. నన్ను నిద్ర లేపితే తిడతాను, లేపకపోతే తిడతాను.

ఆఫీసు గడియారం తిరిగితే తిడతా, తిరక్కపోతే తిడతా. నిన్ను తిట్టడానికి నాకు పూర్తి హక్కుంది.

నువు నాకింద పనిచేస్తున్నావ్. నా ఆఫీసులో పనిచేస్తున్నావ్. ఇదినా సంస్థ. నువ్వు నా కింద ఉద్యోగివి. నాచే నియమింపబడిన ఉద్యోగివి. కంపెనీ అభివృద్ధికి రావాలంటే నిన్ను నే తిట్టితీరాలి. నువు పడితీరాలి. తప్పదు.

ఈ సంస్థ స్థాపించి ఎన్నేళ్లయిందో తెలుసా?— ఇన్నేళ్లుగా కంపెనీలో ఎంతమంది పనిచేశారో, అంతమందీ నాచేత తిట్లు తిన్నవాళ్లే! ఎన్నిసార్లు వాళ్లు ఎన్ని తిట్లు తిన్నారో తెలుసా?— నీకు తెలుసా?— వాళ్లంతా అలా తిట్లు తినటంవల్లనే ఈ కంపెనీ ఈనాడింత అభివృద్ధిలో వుంది.

నిన్ను నేనెంత తిడితే— నువు నాచేత ఎన్నితిట్లుపడితే— అంతా నీ మేలుకే అనుకో. అంతకంతా నీకు ఆయుర్వృద్ధే అనుకో.

ఇండెక్సనం టీ మొదట భయపడతావు. ఒకటిరెండు పుచ్చుకున్నాక భయంతీరి అలవాటు పడిపోతావ్. అలాగ్గే ఈ తిట్లున్ను. మొట్టమొదటి తిట్టే కాస్త బాధనిపిస్తుంది తరువాత నువ్వే అలవాటు పడిపోతావు.

నాకింద పనిచేసినవాళ్లు ఈనాడు గొప్పగొప్ప పదవుల్లో హోదాల్లో వున్నారంటే - ఏమిటనుకున్నావ్ దానికిలక్షం?— అదంతా నా తిట్ల మహిమే. ఆనాడు నే తిట్టిన తిట్లే, ఈనాడు వాళ్లకి కవచాలు శిరమకుటాలు. నాచేత తిట్లుతిన్నవాళ్లలో ఒకడు మంత్రి పదవికూడా అలంకరించాడు. వాడి నెవరేం తిట్టుకున్నాసరే ఈనాడు వాడు ఖాతర్ చెయ్యడు. వాడిపనే వాడిది. వాడి లక్ష్యమే వాడిది. వాడి ధ్యేయమేవాడిది అందుకనే జీవితంగింలో దయించుకు రాగిల్లుతున్నాడు చూశావా, మరి?—

నిన్ను నేను తిట్టేటప్పుడు పెడమొగం పెట్టక, తిట్లు తినలేనివాడు లోకంలో ఎందుకూ కొరగాడు.

ఇంకా నీకు పెళ్లి పెటాకులూ లేదు. పెళ్లయినట్లయితే తిట్లుకింత రుబుడిపేవాడివి కాదు.

బాల్యంలో తల్లిదండ్రులచేత, విద్యాభ్యాసమప్పుడు గురువులచేతా, ఉద్యోగకాలంలో ఆఫీసర్లచేతా, వివాహానంతరం భార్యాబిడ్డలచేతా తిట్లుతిని, — వార్ధక్యమందు పిట్టప్పించువి చేరు వేసుకున్నవాడే మానవుడు. కానివాడు మానవుడు కాడు.

# రోదా



ఒక భంగిమలో స్త్రీ.
శిల్పి: రోదా

*'ప్రతి ఒక్క మేధావి ఆ కాలంలోని వారికి ఒక గడ్డు సమస్య. ఒక అంతుపట్టని యింద్రజాలం'*

—సోమర్ విల్ స్టోరి

**'మానవ శరీరం వదుస్తున్న సుందరాతి సుందరమైన గుడి లాంటిది.'**

—రోదా.

రోదా పేరు విననివారు ఎవరు వుండరు చిత్రజగత్తులో. అసలు ఈ పేరు కళా రంగంలో చిరస్థాయిగ పాతుకపోయింది. సోమర్ విల్స్టోరి అన్నట్లు మైకలాంజిలో తర్వాత వచ్చినవారిలో యిక యింతకంటె గొప్ప శిల్పకారుడు ప్రపంచంలో పుట్ట లేదనడంలో ఏమాత్రం అశ్చర్యం లేదు మైకలాంజిలో శిల్పాలు మానవరూపాలకు ప్రతిరూపాలైతే ఈయనవి జీవ భరిత రూపాలు. ఇలా జీవాన్ని శిల్పాల్లోకి ఒలి కించడం ఎవ్వరూ చేయలేదు చరిత్రలో.

లండన్‌లోని రోలండ్, బ్రౌన్, డెల్ బాకో గ్యాలరిలో రోదా శిల్పాలు ప్రదర్శిస్తున్నారు. శిల్పాలన్ని కంచులో పోత పోసినవి. ప్రదర్శనాలయంలోకి వెళ్తే ఏదో నృత్యమందిరంలోకి వెళ్లినట్లుంటుంది. నర్తకులు నృత్యం చేస్తుంటే తన్మయులై, మనం అలా చూస్తుంటాం నోరు తెరచుకొని వారి వంక. మనతోబాటు అలానే నిలుచుండి చూస్తున్న ఎంతమందివో శిల్పాలు; తీక్షణంగా, విమర్శనాపూర్వకంగా పరిశీలిస్తున్న ఎవరెవరివో తలలు; నాట్యభంగిమలను అనుకరించే వయ్యారపు చేతులు, దృఢమైన మగచేతులు; అసలు దేనిని గమనించక దీర్ఘాలోచనాపరుడైన ఎవరో వ్యక్తి, యింకా యింకా ఎందరో వున్నారు శిల్ప రూపాలలో. ప్రదర్శనలోనికి వెళ్తే ఎంతో మంది మధ్యకు నడచివెళ్లినట్లుంది. కాని ఎవరూ మాట్లాడరు, మనతో.

'ఈయన సృష్టించిన శరీరాలు ఒకదానినొకటి అంటుకొని, వ్రేలాడుతూ, బంతులమాదిరి కరచుకొని వుంటాయి. శరీరాలు ముఖములమాదిరిగా వింటాయి. చేతుల మాదిరిగా పైకి ఎగురుతాయి' అంటాడు కవి రిల్కే. రిల్కే ఎన్నో సంవత్సరాలుగా రోదాకు సెక్రటరిగ పనిచేశాడు. రోదాతో చిత్ర శిల్పకళల గురించి ముఖ్యంగా, ఇతని శిల్పాల గురించి, భావాల గురించి తరచి తెల్సుకున్నాడు. శిల్పాలు చూస్తే తెలుస్తుంది శిల్పి ఎంతగా మానవ శరీరాన్ని అవగాహన చేసుకున్నది. శరీరంలోని వయ్యారపు వంపుసొంపులు, బలం, చకితుల్ని చేస్తాయి. ఇంతగా మానవశరీరాన్ని ఆరాధించిన వ్యక్తి మరొకరు లేరేమో. సర్వజగత్తును చూచాడు గాబోలు అందులో. విచిత్రం! కొంతమందికి ప్రకృతిమూలమైతే మరి కొంతమందికి మానవరూపమే మూలాధారం ప్రతి సృష్టికి. కొంతమంది మానవ శరీరంలో సర్వజగత్తును చూస్తారు. మరి కొంతమంది ప్రకృతిని చూస్తారు. ప్రకృతి, పురుషుడు మూలంలో ఒకరేనేమో!



రోదా
అంతోనీ ఎం. లూదోవికి తీసిన ఛాయా చిత్రంనుంచి గీసిన రేఖా చిత్రం.

ఇంతగా మానవరూపాన్ని అరాధించిన శిల్పిని గురించి అతని జీవితవిధానాన్ని గురించి వ్రాస్తాను. రోదా 14 నవంబరు 1840 లో పారిస్‌లో పుట్టాడు. చిన్నప్పటి నుండీ కళలంటే ఎంతో అభిలాష. శిల్పాలను చేస్తూ, కంసాలి పనిచేస్తూ ఎంతో కాలం గడపాడు. లెక్కలు అంటే మహా భయం, ఏవగింపు. శిల్పకారునిగా పెద్ద సంచలనాన్ని తెచ్చాడు తన 35వ ఏట. బ్రసెల్స్‌లో ఒక శిల్పాన్నిచేసాడు 'ది ఏజ్ అఫ్ బ్రాన్జ్' అని. 18నెలలు కష్టపడిచేసాడు శిల్పాన్ని ఒకసైనికున్ని మోడలుగవుంచుకొని. ఇది రోమన్ శిల్పాలు మాదిరిగ వుంటుంది. నగ్నంగా వున్న యువకుడు వయ్యారంగా ఒకచేతిని తలమీద వుంచుకొని, మరొక చేతిని మడచి బలాన్ని చూపిస్తున్న వస్తాదు లాగ, నిల్చుండి వుంటాడు. ఈ శిల్పం ప్లాస్టరు నమూనాను పారిస్‌లో 1877 లో సెలాన్ ప్రదర్శనలో ప్రదర్శిస్తే సెలాన్ కమిటీవారు ఈ శిల్ప సహజత్వాన్ని



విగ్రహం.

నమ్మలేకపోయారు. అంత సహజంగా వుంది. నిజమైన మనిషిని ప్లాస్టరులో కాపీ తీసి చేసిన శిల్పమని ప్రకటించారు. ఇకనేం పత్రికలన్నీ ఈ విషయాన్ని పట్టుకొని ప్రచారం చేసాయి సెలాన్‌లో ప్రదర్శించడమంటేనే ఎంతో గౌరవం చిత్రకారులకు. మొదటిలోనే ఇలాంటి అపవాదు పడ్తే చిత్రకారుని జీవితం ధ్వంసమే, అందులోనూ యింత చిన్నతనంలో, జీవితంఅంతా ముందు వుండగా. రోదా పట్టుదలగల వ్యక్తి. దేన్నీ సామాన్యంగా వదిలే తత్వం గాదు. సెలాన్ కమిటీని ఎదుర్కొన్నాడు తాను బ్రసెల్స్‌లోని ఒక సిపాయిని మోడలుగా వుంచి చేసిన శిల్పమని, మోడల్‌ను బ్రసెల్స్ నుండి రప్పిస్తానని అన్నా ఎవరూ వినలేదు మోడల్‌నుండి తీసిన ప్లాస్టరు కాపీని ఫోటోలు తీసిపంపితే ఈ పార్శిలే విప్పలేదు కమిటి. పంతంగల శిల్పి, అందులోనూ ఫ్రెంచి శిల్పి—అవమానాన్ని భరించగలడా! మంత్రిగారితో చెప్పి కమిటీని వేసి నిజాని తేల్చవలసిందిగ కోరాడు. ప్రభుత్వపు కమిటి రోదా శిల్పం నిజమైనదని తేల్చినా సెలాన్ కమిటి ఒప్పుకోలేదు. చేసేది లేక వూరుకున్నాడు రోదా.

బౌచర్ అనే తోటి శిల్పకారుడు ఒక 'పిల్లల గ్రూపు'ను చేయవలసిందిగ కోరితే దానికి ఒప్పుకున్నాడు. ఎంతోకాలం తీసుకోకుండా! బ్రహ్మాండంగా మలచిన ఈ శిల్పాన్ని చూచి బౌచర్ ఆశ్చర్యపోయాడు. ఇది చేయగల్గిన వ్యక్తి 'ది ఏజ్ అఫ్ బ్రాన్జ్' చేయడంలో ఏమాత్రం అనుమానం లేదని, పారిస్‌లోని చిత్రకారు లందరితో కలిసి మరల మంత్రిగారిదగ్గరకు వెళ్లి రోదాపై గల అపవాదును తొలగించ కోరారు. ఇలా అందరు చిత్రకారులు, శిల్పకారులు కలిసి అభిప్రాయాన్ని వెలిబుచ్చడం పారిస్‌లో ఏనాడు జరుగలేదు. జయం లభించింది రోదాకు. మంత్రిగారు శిల్పకారునికి ఒక మెడలును బహుకరించి, ఈ శిల్పాన్ని స్టేటుకుగాను కొన్నారు. అంతేగాక కళా భవనానికి ద్వారాలు శిల్పంలో చేయమని ప్రభుత్వం తరఫున క్రొత్త పని గూడ యిచ్చారు మంత్రిగారు. ఇది ఎంతో సంతోషాన్ని తెచ్చినా సెలాన్ కమిటి చేసినపనికి, తనపై అపవాదును తొలగించడానికి ప్రభుత్వం తీసుకున్న కాలానికి ఎంతగానో విచారించాడు. ఏనాడు సెలాన్‌ను క్షమించలేదు. కాని ఈ ప్రచారం రోదాకు ఎంతో పేరు తెచ్చింది. ప్రజలు గొప్ప శిల్పకారునిగా పొగడడం ప్రారంభించారు.

'నిజమైన మనిషినుండి నమూనాలను తీసి శిల్పాలను మలచానని నింద వేశారు గనుక ఈ దఫా ఈ ద్వారాలపై వుబ్బెత్తుగ వుండేట్టుగ, ఎన్నో శిల్పాలను మలుస్తాను. అన్ని చిన్న సైజులో. అప్పుడు ఎవరూ నేను మోసం చేసానని అనరు. ఈ ద్వారానికి కవి డాంటేను ఆధారంగా తీసుకుంటాను' అని రోదా ప్రకటించాడు.



చెయ్యి.

రోదా పేరు చిరస్థాయిగ నిలిచిపోయింది ఈ ద్వార శిల్పంవల్లనే. జీవితాన్ని ధారపోసాడు దీన్ని మలచడంలో. కాని పూర్తి చేయకుండానే చనిపోయాడు. ఎన్నిసార్లో అసలు అనుకున్న డిజైనును మార్చాడు. అసలు ఒప్పుకుంది చిన్న ద్వారాన్ని చేస్తానని కొన్ని వుబ్బెత్తు రూపాలతో. అది అంతా పోయింది. ఒక మహాకళాఖండాన్ని వూహించి చేయసాగాడు.

జూడిత్ క్లాడెల్ చక్కగ చెప్పింది ఈ శిల్పాన్ని గురించి. 'తన ఆత్మసంక్షోభాన్ని, భగవంతుని ఆధిక్యతను సవాలుచేసే మానవ తత్వాన్ని చూపుతూ ఒక బ్రహ్మాండమైన విజయచిహ్నాన్ని నిలబెట్టాలనే ప్రయత్నం.' తన యువదశలో మత తత్వాన్ని నిరసించేవాడు, రోదా. జూడిత్ తనతో రోడిన్ అన్న మాటల్ని వ్రాస్తుంది యిలా. 'ప్రతి ఒక్క మానవునిలోనూ, ప్రతి సమయంలోనూ, రెండు ప్రభావాలు ఒక్కసారిగ ప్రసరిస్తాయి. ఒక్కటి దైవము వైపు చూస్తే మరొకటి దయ్యము వైపు సాగుతుంది' రోదాను బాగా అర్థం చేసుకున్నవారిలో జూడిత్ ఒకావిడ.

ఈ 'గేట్ అఫ్ హెల్' అన్న శిల్పఖండంలో 186 శిల్పాలున్నాయి. మానవునిలో వున్న అన్ని భావాలను చూపే అద్దంలాంటిది. ప్రతి శిల్పం వయ్యారంతో మలచబడింది. కోపాన్ని, ఆలోచనల్ని, విచారాన్ని, భయాన్ని, బాధల్ని చూపే మానవ ప్రతిరూపమయం. ముఖ్యంగా చూపదలచుకున్నది, సోమర్ విల్‌స్టోరి అన్నట్టు, మానవగమనంలోని జీవాన్ని. ఈ పెద్ద శిల్పంలో యిముడ్చడం కొరకు ఎన్నో వివిధ శిల్పాలను మలచాడు రోదా. ప్రతి వొక్క శిల్పం ఒక మహత్తర కళాఖండం. ప్రతి ఒక్క శిల్పానికి కొన్నివందల స్కెచ్‌లు వేశాడు—వూహాతీతం గదూ! థింకర్, కిస్, ఏడమ్, ఈవ్, ది త్రీ షేడోస్ మొదలగు ప్రసిద్ధ శిల్పాలన్నీ గేటులో యిముడ్చడానికి చేసినవే.

పాల్ గజెల్ అనే ఆయన వివరించాడు రోదా ఎలా శిల్పాల్ని మలచేది స్ఫూడి

డోలో ఎంతోమంది మగ, ఆడ మోడల్స్ వుండేవారట ఎప్పుడూ. వారందరికి జీతాలు యిచ్చివుంచేవాడు. అందరూ నగ్నంగా తిరుగుతూ, వయ్యారంగా నడుస్తూ, వివిధ భంగిమలలో హావభావాలను ప్రసరిస్తూ వుండేవారు. రోదా ఆ గదినే స్టూడియోగా వుపయోగిస్తూ శిల్పాలను మలచేవాడు, విశ్రాంతి తీసుకునేవాడు. ఈ విధంగా తాను మానవసందోహంలో నివసిస్తూ, జీవితాన్ని ప్రతిఫలించాడు కళలో. ఎన్నోవేల స్కెచ్‌లు వేశాడు వీరందరిని చూస్తూ. మానవ అంగయంత్రాంగ అంతరంగాన్ని బాగా ఆకళింపు చేసుకున్నాడు. యిలాంటప్పుడే అన్నాడు రోదా 'నేత్రాలను, తెలివిని ఎలా వుపయోగించాలో తెలిసిన వారికే మేధస్సు ఫలిస్తుంది. వారే మేధావులు' ఎంత నిజమో యిది ఆయన శిల్పాలే నిదర్శనాలు. ఈ 'మానవ మోడల్స్'ను సదా చూడడమేగాక, వారిని బాగా అర్థం చేసుకున్నాడు. వారి జీవిత చరిత్రలను విన్నాడు. ఎవరి యిష్టం వచ్చినట్లు వారిని ప్రవర్తించనిచ్చాడు. ఆ విధంగా వారిని చూస్తూ శిల్పాల్ని మలుస్తూపోగా యింతింతగా సాగి అంతంత అయ్యింది ఈ ద్వారం. సంవత్సరాలుగా సాగిందీ శిల్పఖండం" అని వివరిస్తాడు కవియైన రిల్కే. దీన్ని గురించి చెప్తూ రోదా అంటాడు. 'నా ప్రతి ఒక్క శిల్పాన్ని గురించి మాటలలో చెప్పాలంటె కనీసం ఒక్కొక్కటి సంవత్సరం తీసుకుంటుంది." ఈ ద్వారంలో 186 శిల్పాలున్నాయి.

గత కాలపు మహాకవి డాంటే వూహలు మరో శతాబ్దంలో మారుమ్రోగినాయి. ఇవి రోదాలోని చిత్రకారుణ్ణి నిద్రనుండి లేపినాయి. నూత్న రూపాలతో, నూత్న శతాబ్దాన్ని ప్రతిబింబింపచేశాడు. కవి డాంటే వూహలను ఆధారంగా తీసుకొని రోదా తన ప్రయత్నంలో మానవుల్ని వూహలుగా మార్చి యుగాయుగాలుగా వస్తున్న కళకు క్రొత్త మెరుగు పెట్టాడు.

దాదాపు ప్రతిశిల్పం ఏదో ఒక వాదనతోనో లేక దురదృష్టంతోనో ముగిసింది. బాల్జాక్ శిల్పాన్ని చెయ్యవలసిందిగా సొసైటీ ఆఫ్ లెటర్స్ సొసైటీవారు అడిగారు రోదాను. దానికి ముఖ్య కారణం ప్రముఖ రచయిత, జోలా. ఎంతోమంది ఈ శిల్పాన్ని చేస్తామని ముందుకు వచ్చినా సొసైటి రోదాను చెయ్యవలసిందిగా నిర్ణయించింది. ఏడు సంవత్సరాలు కష్టపడి చేశాడు. తీరా అంతా తయారయ్యాక చూపితే 'బాల్జాక్‌కు బదులుగా రోదా మనకు ఒక మంచుమనిషి నిచ్చాడు' అని పేపర్లు, ప్రజలు నిగతాళివేసి, నవ్వులాటగా తీసుకున్నాయి. సొసైటీ ఈ శిల్పాన్ని తీసుకో నిరాకరించింది. ఇది రోదావద్దనే వుండిపోయింది. పెద్ద తల, గాలికి చెల్లాచెదరైన జుట్టు, పెద్ద మడతలతో వున్న వదులైన బట్టలు, అంతా ఒక బుట్టబొమ్మ మాదిరిగ వుంటుంది శిల్పాన్ని చూస్తుంటే.

ఇలాగే మరొకటి 'బర్గర్స్ ఆఫ్ కలెయిస్' అన్నది. కలెయిస్ అనే పట్టణపు కౌన్సిలువారు యూస్టాష్ డి సెయింట్ పియరే అన్న ఒకాయన శిలాన్ని చేయమని కోరింది. యుద్ధకాలంలో ఆ పట్టణానికి ఎంతో పేరుతెచ్చాడు ఈ వ్యక్తి. చేయడం మొదలు పెట్టాక వుత్సాహం పెరిగి ఒకతని శిల్పాన్ని చేసేబదులు మరొక అయిదుగురిని చేర్చి ఒక సమూహచిత్రాన్ని చేసాడు. ఇతను అంత వీరుడైనప్పుడు ఆతనిని అనుసరించేవారు గూడ వుండాలని తలచి, ఇలా చేసాడు. కౌన్సిలువారిని ఒక్క శిల్పానికి యిస్తానన్న 15000 ఫ్రాంకులకంటే ఏమి ఎక్కువ యివ్వనక్కరలేదని కోరాడు. దీన్నిబట్టి మనకు తెలుస్తుంది శిల్పకారుని తత్వం. కళకొరకు ధనాన్ని త్యజిస్తాడు. అసలు డబ్బు ప్రధానంగాదు. తోటి చిత్రకారులందరు రోదా వట్టి పిచ్చవాడు, యింత పెద్ద శిల్పానికి యింత తక్కువ తీసుకోవడ మేమిటని నిరశించారు. ఈ శిల్పంలోనివారు ఎంతో దీనంగా, బీదతనాన్ని ఒలికిస్తారు. పంగిన శరీరాలతో వుండే ఈ శిల్పాన్ని పారిస్ నిరాకరించింది. ఫ్రెంచివానికున్న హుందా, గీవి ఈ శిల్పంలో లేవని విమర్శించింది. దీన్ని నేను అమెరికాలో ఫిలడల్ఫియాలో చూచాను. దీనికి మరొక నమూనా యూరప్‌లో కోపెన్‌హాగన్‌లో వుంది. విడిగా చేసిన శిల్పాలన్నిటితో యిదే పెద్దది.

రోదా చాల ఆడంబరంగా బ్రతికాడు. రోజూ మంగలివాడు యింటికి వచ్చి గంభీరమైన ఫ్రెంచి గడ్డాన్ని అందంగా కత్తిరించి దువ్వి, సెంటు రాసేవాడు. ఆలాంటప్పుడు సెక్రటరీ దగ్గర కూర్చుని వచ్చిన వుత్తరాలు చదవడం, జవాబులు వ్రాయడం జరిగేది. ఆయన జవాబులు చెప్పే వేగానికి షార్టుహాండ్ వచ్చినవారు తప్పితే మామూలు సెక్రటరీకి చాల కష్టం.

రోదాకు యింగ్లీషు అసలు రాదు.

ఫ్రెంచి తప్పితే మరో భాష రాదు. భార్యకు అసలు చదువే రాదు. అయినా ఎంతో శ్రద్ధగా తాను చేసే శిల్పకళకు తోడ్పడింది. స్టూడియోను వెయ్యి కన్నులతో కాపాడేది. రాత్రి నిద్రపోయేముందు మట్టితో చేసిన శిల్పాలన్నిటికి నీరు చల్లి, గుడ్డ చుట్టి చాలా జాగ్రత్తగా కాపాడేది. రోదా చాలా మితభాషి. ఆయనచేత మాట్లాడించడం ఒక ప్రయత్నం అని చెప్పవచ్చు. ఫ్రెంచిలో మాత్రం, మాట్లాడితే, చాల ధారాళంగా మాట్లాడేవాడు. 'రోజా మాట్లాడుతుంటే మనసులో వచ్చే దీర్ఘాలోచనలకు అసలు అవకాశంలేదు' అనేవాడు.

మానవ రూపాన్ని ఆరాధించి, మన

# రోదా

ముందున్న ప్రతిరూపాలను ప్రతిష్ఠించిన వ్యక్తి చివరిదశలో ఈ మేధావి వేదాంతి అయ్యాడని అనిపిస్తుంది నాకు. ఈయనను చిరస్థాయిగ కళా రంగంలో ప్రతిష్ఠించిన శిల్పం 'గేట్స్ ఆఫ్ హెల్' అన్నది. నిజానికి ఈ శిల్పం ద్వారం కానేకాదు. ఈ ద్వారాన్ని తెరవలేం. అలాగనే చేసిన శిల్పం యిది. అన్ని గొప్ప శిల్పాలు ఈ ద్వారం నుండి వచ్చినవే. యిందులో యిముద్చుట కొఱకు చేసినవే. ఈ ద్వారం డాంటే యొక్క 'డివైన్ కామెడి'కి రూపమయ వర్ణనకాదు; మైకలాంజిలో చేసిన లాంటి బ్రహ్మాండమైన 'ది లాస్ట్ జడ్జిమెంట్' కాదు. ఇది శిల్పకారుని మానవజాతి స్థితిపై పెట్టిన మహోన్నత ధ్యానం, అంతర్ దృష్టితో చూచే అవలోకన. దీనిలోని నరకం అందరు అనుకునే నరకం గాదు. అది మానవ జీవితంలో నెరవేరని హృదయ బాధలకు ప్రతిరూపం. ఇది ఆయన నరకానికిచ్చిన అర్థం.

ప్రతి మేధావి ప్రపంచాన్ని ఒక క్రొత్త దృష్టితో చూస్తాడు. అలానే చూచాడు రోదా.

—ఎస్. వి. రామారావు

గమనిక - ఫ్రెంచి ఉచ్చారణ ప్రకారం Rodin పేరుని రోదాఁ అని రచయిత రాశారుకాని అచ్చు కూర్పేవారి సౌకర్యం కోసం అరసున్న వదిలివేశాము —సం.

# మంత్రబలం



చక్రవర్తి రాజ్యంలో ఒక పెద్ద అడవి ఉంది. ఆ అడవిని ఆనుకొని కొన్ని పల్లెటూళ్ళు ఉన్నాయి. ఒకప్పుడు ఖడ్గమృగంవంటి మృగం ఒకటి ఒక పల్లెటూళ్ళో ప్రవేశించి పంటలను పాడుచేయడం ప్రారంభించింది. ప్రజలు ఆ మృగానికి భయపడి చక్రవర్తి వద్దకు వెళ్ళి తమ పంటలను రక్షించవలసినదిగా కోరారు.

చక్రవర్తి అప్పుడు ఆ మృగాన్ని చంపివేయవలసినదిగా సైనికులను ఆజ్ఞాపించాడు కాని ప్రజలు అందుకు అంగీకరించలేదు. ఆ మృగాన్ని చంపి వేసినట్లయితే గ్రామానికి అరిష్టం కలుగుతుందని వారికి నమ్మకం ఉంది. అందుచేత ఆ మృగాన్ని బోనులో పెట్టి బంధించడానికి కూడా ప్రజలు అంగీకరించలేదు.

ఆ పరిస్థితిలో యేమి చేయాలో చక్రవర్తికి తోచలేదు. మల్లన్నమంత్రి తెలివితేటలను గురించిన కథలు అందరికీ తెలిసి ఉండడంవలన, సభలోని పెద్దలు కొంతమంది మల్లన్నమంత్రిని సలహా అడగడం మంచిదని చక్రవర్తికి చెప్పేరు. జరిగినదంతా వివరంగా ఉత్తరం రాసి తమ దేశానికి వచ్చి యీ సమస్యను పరిష్కరించవలసినదిగా చక్రవర్తి తమ దూతల ద్వారా మల్లన్న మంత్రిని కోరేడు. మల్లన్నమంత్రి అప్పుడు చక్రవర్తి సభకు వెళ్లి యిలాగ అన్నాడు.

'ప్రభూ! ఇక్కడ జరిగిన సంగతిని మా గురువుగారికి చెప్పేను. ఆ మృగం నుండి ప్రజలను రక్షించడానికి మా గురువుగారు నాకు ఒక మంత్రాన్ని ఉపదేశించారు. కాని ఆ మంత్రాన్ని ప్రయోగించడానికి ముందు కొన్ని పనులను చేయవలసి ఉంది.'

మల్లన్నమంత్రి చెప్పిన పనులను చేయమని చక్రవర్తి కొంతమంది భటులను ఆజ్ఞాపించాడు. మల్లన్న మంత్రి భటులను తీసికొని ఆ మృగం ఉన్న పల్లెటూరికి వెళ్లాడు. ఆ ఊరికి సమీపంలో ఒక గుహను తొలిపింపజేశాడు. ఆ గుహకు మీదను ఒక కన్నాన్నికూడా యేర్పాటు చేశాడు. తరువాత ఆ గుహలో వేరుశనక్కాయలను గుట్టలుగా పోయించాడు మల్లన్న మంత్రి.



## మల్లన్న మంత్రి

కౌటిల్య



ఆ మృగం తిరుగుతుండే ప్రాంతం నుంచి గుహలోపలివరకు ఆ మృగానికి యిష్టమైన ఆహార పదార్థాలను ఉంచారు. ఆ మృగం ఆ ఆహార పదార్థాలను తింటూ గుహలోనికి ప్రవేశించింది. తరువాత ఆ మృగం అక్కడ ఉన్న వేరుశనక్కాయలను తింటూ రెండుమూడు రోజులపాటు గుహలోనే ఉండిపోయింది. ఆ మృగం తరువాత యెంత ప్రయత్నంచేసినా, ఆ గుహ యొక్క ద్వారంలోనుంచి బయటకు రాలేకపోయింది.

అప్పుడు మల్లన్నమంత్రి గ్రామస్థులతో యిలాగ అన్నాడు 'మా మంత్ర బలంవలన ఆ మృగాన్ని గుహలో బంధించి వేశాము. కాని మా మంత్ర శక్తి ఆ మృగం వేరుశనక్కాయలు తింటూ ఉన్నంతవరకే పనిచేస్తుంది. అందుచేత మీలో రోజుకు ఒకరు చొప్పున ఆ గుహమీదనున్న కన్నంలో నుంచి ఒక బస్తా వేరుశనక్కాయలు కొంతనీరు గుహలో వెయ్యాలి'

ప్రజలు దానికి అంగీకరించి మల్లన్న మంత్రిని చాలా గౌరవించారు. చక్రవర్తి కూడా యీ వార్తను విని అతన్ని యెంతగానో గౌరవించాడు. మల్లన్నమంత్రి తన రాజ్యానికి చేరుకొన్న తరువాత 'యేమి మంత్రాన్ని వేశావని' రాజు అడిగాడు. అందుకు మల్లన్నమంత్రి చిరునవ్వు నవ్వుతూ యిలాగ అన్నాడు.

'ప్రభూ! ఇందులో మంత్రం యేమీలేదు. అంతా తంత్రమే. నేను చక్రవర్తివద్దకు వెళ్లేముందు ఆ మృగాన్ని గురించి జంతు శాస్త్రజ్ఞుల్ని అడిగేను. వేరుశనక్కాయలను తిన్నట్లయితే ఆమృగం బాగా లావు అవుతుందని వారు చెప్పారు. యెంతలావు ఉందో దూరంనుంచి జాగ్రత్తగా పరిశీలించి గుహకుసరిగ్గా అంత వెడల్పుమాత్రమే

ఉండే ద్వారాన్ని యేర్పాటు చేయించాను. అందుచేత ఆ మృగం మామూలుగా లోపలకు వెళ్లి వేరుశనక్కాయలు మూడురోజులపాటు తినేసరికి ఊరిపోయింది. అందుచేత ఆ మృగం

## బాలసాహితి

తిరిగి యివతలకు రాలేకపోయింది. గ్రామస్థులు వేసే వేరుశనక్కాయలను అది రోజూ తింటుండడంవలన అదియిక యెప్పటికీ కూడా యివతలకు రాలేదు.'

ఈ సమాధానం విని రాజా మల్లన్నమంత్రి యుక్తిని యెంతగానో మెచ్చుకొన్నాడు. ●






# ధర్మపథం

బులుసు వెంకటరమణయ్య

మహా యోగుల ఉపదేశాలకు చెవియిచ్చి రాజ్యాంగాన్ని నడిపే మహారాజులూ అప్పు డున్నారు; పెద్దల మాట లక్ష్యం చెయ్యక యిష్టంవచ్చినట్లు పాలన సాగించిన ప్రభువులూ ఉండేవారు.

వీరిలో ఛత్రపతి శివాజీ మహారాజు మొదటి రకానికి చెందినవాడు.

ఆయనకు సమర్థ రామదాసు స్వామి యందు అపారమైన భక్తిగౌరవాలు!

అప్పుడప్పుడు శివాజీ గురూజీని సందర్శించడంకోసం ఆయన నివసించివుండే అరణ్యానికి వెళ్ళడం కద్దు.

అలా దర్శించినప్పుడు ప్రభువుయొక్కయు, ప్రజల యొక్కయు యోగక్షేమాన్ని ఆ యోగీశ్వరుడు ప్రశ్నించడం, తృప్తికరంగా శివాజీ సమాధానం చెప్పడం జరుగుతుంది. అందువల్ల ఏదో విజయం సాధించిన తర్వాత శివాజీ ఆయనదగ్గరకు వెళుతూ ఉండేవాడు.

ఒకసారి ఛత్రపతి అరణ్యానికి వెళ్ళి స్వామి ఆశ్రమాన్ని సమీపించాడు. అప్పటికి మహాయోగి ధ్యానంలో నిమగ్నుడై వున్నందున కొంచెంసేపు నిరీక్షించవలసి వచ్చింది

ధ్యానం ముగిసిన తర్వాత ఆయనకు శివాజీ రాక తెలుపబడింది. ఆయన లోపలి నుండి బయటికి వచ్చారు శివాజీ గురూజీకి సాష్టాంగ నమస్కారంచేసి ఆశీస్సు అందుకున్నాడు.

'నాయనా! నీ పరిపాలన చక్కగా సాగుతున్నదిగదా! కొత్తగా ఏ చిక్కులూ సంభవించలేదుకదా! నీకూ, ప్రజలకూ క్షేమమే కదా!' అని ప్రశ్న.

'ఏ కొత్త చిక్కులూ లేవు ప్రజలు క్షేమంగానే ఉన్నారు. సాధ్యమైనంతవరకూ ప్రజలకే కాకుండా మిగతా ప్రాణులకున్నూ మేలు కలిగించాలనే నా సంకల్పం! నా రాజ్యంలో గోవధ జరుగకూడదని యెప్పుడో శాసించాను. నా ఆజ్ఞప్రకారం జరుగుతున్నదనే నా విశ్వాసం!'

'చాలా మంచిపని చేశావు అయితే నీ రాజ్యంలో మనుష్యులకే కాకుండా యితర ప్రాణులకు కూడా క్షేమమే అన్నమాట! నీ పరిపాలన మెచ్చదగినదే!' అన్నారు స్వామి చిరునవ్వు నవ్వుతూ.

'దీనికి గురూజీ ఆశీర్వాదమే ముఖ్య కారణం. తమ అనుగ్రహం వుంటే నేను చెయ్యలేనిది యేదీ వుండదు.'

తర్వాత ఒక నిమిషం నిశ్శబ్దం.

స్వామి తమ శిష్యుని ఒకణ్ణి పిలిచి, లోపల వున్న ఒక చిన్న సుత్తిని తీసుకు రావాలని ఆనతిచ్చారు. అతడు తేగానే, ఆ సమీపంలో వున్న ఒక రాతిని మెల్లగా పగులగొట్టవలెనని చెప్పారు.

పగులగొట్టగా — ఆ రాతి నడుమ ఒక చిన్న కప్పపిల్ల, కొంచెం నీరూ కానవచ్చింది. అందరూ దాన్ని ఆశ్చర్యంగా చూశారు.

'నాయనా! శివాజీ! ఈ అరణ్యం నీ రాజ్యంలో చేరిందేగదా! ఈ అడవిలోని యీ రాతిలో ఉన్న కప్ప కూడా నీ రక్షణ వల్లనే సుఖంగా జీవిస్తున్న దన్నమాట!' అని స్వామి అన్నారు.

శివాజీ నిర్ఘాంతపోయేడు. ఆయన బాగా తలవంచుకున్నాడు.

'నాయనా! సృష్టి, స్థితి, లయాలకు కారణభూతుడు భగవంతుడు మానవులమైన మనమందరమూ నిమిత్తమాత్రులం! 'దీన్ని నేనే చేశాను; నా మంచివల్లనే అందరికీ క్షేమం, నా కోపంవల్ల కష్టనష్టాలూ కలుగుతా'యని అహంకారం ఎంతమాత్రమూ కూడదు. పరిపాలన చేస్తున్న వారికి యీ సంగతి తెలిసీన్నీ తెలియకుండా ఉంటుంది ఈ అహంకారాన్ని జయించినప్పుడే నీవు దేనినయినా జయించగలవు' అని స్వామి సదుపదేశం.

తన తప్పు తెలిసికొని ఛత్రపతి పశ్చాత్తాపపడ్డాడు. అతని అహంకృతి పటాపంచలైనది. తల వంచుకున్న అతని కన్నులనుండి ఆనందబాష్పాలు వెలిసి రాలాయి.



# మొగిలి పువ్వు

## కొంపల్లి గౌరీశంకర్



ఆకాశం చీకటిని ప్రసవించి మత్తులో మునిగినవేళ —

అలివాటైన ఆ జీమూతంలోనుంచి అడుగులో అడుగువేసుకుంటూ నడిచి వచ్చింది ముత్యాలు. చప్పుడుచేయకుండా తలుపు తోసుకొని లోపలికివచ్చి, కిరసనాయిలు బుడ్డి దీపపు వత్తిని పైకితోసింది. కుక్కి మంచంలో నిద్రపోతున్న చంద్రాయ్ మొహం కనిపించేలా వెలుగు వ్యాపించింది. కిటికీ ఊచల సందుల్లోనుంచి లోపలికి ప్రవేశించిన గుడ్డివెన్నెల. దీపంకాంతితో కలిసి చీకటిమీద యుద్ధంచేస్తోంది. వెలుగును మింగాలని చీకటి. చీకటిని కబళించాలని వెలుగు ఈ యుగయుగాల చిరపోరాటంలో చీకటిదే పైచెయ్యవుతున్నది. చామనచాయ వెలుగులో చంద్రాయ్‌ని ఒక్కక్షణం పరికించింది ముత్యాలు.

నిర్మలంగాఉన్న నుదురు. బ్రతుకులోని నీడల్ని తెలియని మొహం. చిన్న విశ్వాస చేసింది ముత్యాలు. ఆమె దృష్టి గోడ వైపుకు తిరిగింది.

గోడకు మధ్యగా అందంగా మొగిలి పువ్వు. దానిచుట్టూ కొంతదూరంలో వలయాకారంగా చిన్న చిన్న రెక్కల పురుగులు. ఆ వలయంలో కొంతభాగం ఖాళీగా తెల్లగాఉంది. తెల్లగా వెల్లవేసిన గోడ మీద, పాపంలాంటి నల్లటి బొమ్మలు,

వికృతంగా, వికారంగా.

ముక్కోణాకారంగా ఉన్న గూట్లోంచి బొగ్గుముక్క తీసుకుని, ఖాళీగా ఉన్న వలయంలో మరో రెక్కల పురుగుని గీచింది ముత్యాలు. ఆ బొమ్మలవంక కాసేపు తదేకంగా చూసింది. వలయం రెండుకొసలూ దగ్గరవుతున్నాయి, జీవితానికున్న పరిధిలా.

చెంగునఉన్న డబ్బును తీసి, పెట్టె అడుగున ఉంచిన తర్వాత, దీపాన్ని తగ్గించి కటికనేలమీద చెంగుపరచుకుని పడుకుంది. కళ్లు మూసుకుంటే భయంకరమైన చీకటి. కంటికందని చీకటి. అందుకనే కళ్లు తెరుచుకుని కనిపించే చీకటినే చూస్తూ ఉండిపోయింది. ఈ చీకటి అంత భయంకరంగా లేదు. సుళ్ళుచుడుతున్న చీకటితోపాటు గతంకూడా గిర్రున తిరిగింది. మేలుకొనే పీడకల కంటోంది ముత్యాలు.

* * *

అమాయకత్వానికి పల్లెటూళ్లు ఆటపట్టని ప్రతీతి. ఆగ్రామంలో అది అన్ని చోట్లా నిండుకున్నా, రూపందాల్చి ముత్యాలుగా మారిందా అనిపించేది ఎవరికైనా ఆమెని చూస్తే.

బ్రహ్మ ఓ అందమైన బొమ్మను చేసి, నూరేళ్లమటుకే ఆయువు పోశాడు. అందుకే ముత్యాలు భూమికి జారింది. ఆ బొమ్మను సృష్టికర్త చిరాయువుగా చేసినట్లయితే, బహుశా ముత్యాలు దేవలోకంలో ఉండి ఉండేది.

బొమ్మలా ఉండే ముత్యాలుకు బొమ్మలు గీయడం వచ్చు. ఆమె బొమ్మలు జీవంతో కళకళ లాడుతుంటాయి. అప్పుడే పుట్టిన వెన్నెల్నీ, ఆడుకుంటున్న పిల్లల్నీ, వెలుగులో తలలూపుతున్న మల్లెల్నీ, ఎన్నిటినో తనకు తనివితీరేలా చిత్రించుకొనేది. సౌందర్య చిత్రణకు అలవాటుపడ్డ ఆమె చేతులు, ఆమె జీవిత చిత్రాన్ని కూడా అందంగా మలచాయి. తల్లి పూజ చేసుకొనే ప్రదేశంలో గోడమీద గుర్రపు స్వారీ చేస్తున్న ఓ రాజకుమారుడి బొమ్మను గీచుకొంది. అతని కళ్లల్లో చిలిపితనాన్ని నింపింది. గుర్రం పక్కగా పూల హారంతో ఒక స్త్రీ బొమ్మను వేసి, ఆమె కళ్లల్లో ఆశను పోసింది. ఆ బొమ్మల్ని చూసుకొన్నప్పుడల్లా ముత్యాలుకు సంతోషం కలిగేది. వెంటనే సిగ్గువేసేది. మాటల కందని భావాల్లో తలమునక లయేది. అప్పుడప్పుడు పూలహారంతో వున్న ఆ స్త్రీలో తన పోలికలు కనిపించేవి ముత్యాలుకు.

ముత్యాలు తల్లికి దైవ భక్తి హెచ్చు. కుటుంబంలో ఎవరికీ అలవాటు లేని పూజలూ పునస్కారాలూ గవరమ్మకు మెండు. అందువల్లనే అందరూ ఆమెను 'పుణ్యాత్మురాలు' అనుకొనేవారు. ఆ పేరును నిలుపుకోటానికేమో అన్నట్లుగా, మధ్య వయసు దాటకుండానే మరణించిందామె. తల్లి మరణంతో, తాగుడుతో యింటికి రాని తండ్రి ఒక్కడే మిగిలాడు ముత్యాలుకు. ఇప్పుడామెకు బొమ్మలు గీచుకొనే తీరిక లేదు. చూచుకొనే ఓపికా మిగల్లేదు. కళ్లల్లో వత్తులు వేసుకొని, తండ్రి రాక కోసం ఎదురు చూడటంతోనే ఆమె కాలమంతా గడిచిపోయేది. తన లోకంలో తన్మయత్వంలో మునిగిపోయే ముత్యాలును బాధ్యత బంధించివేసింది.

కానీ ఎంతో కాలం గడవకుండానే ఆ బాధ్యతను తీసుకోటానికి వచ్చింది తల్లిలాంటి తల్లి. ఎప్పుడూ ఊరిని ఇంటిగా చేసుకొని తిరిగే పైడయ్య ఇంటి పట్టునే ఉండసాగాడు. జానమ్మను చూపించి, ముత్యాలుతో 'మీ అమ్మ' అని చెప్పాడు పైడయ్య. 'ఔను. అమ్మ' అనుకుంది ముత్యాలు. 'నీ కూతురు' అని ముత్యాలును జానమ్మకు చూపాడు పైడయ్య, అదే సమయంలో. ఎకసెక్కెంగా నవ్వుకుంది జానమ్మ, తనకూ, తన 'కూతురి'కీ వయసులో కనిపించని తేడాని తలుచుకుని.

'మా అమ్మ' అనుకొంటూ యింట్లో సమస్త చాకిరీ చేసేది ముత్యాలు. 'మా అమ్మేగా' అనుకుంటూ పొలానికెళ్లి గొడ్లకు గడ్డి కోసుకొచ్చేది. 'అమ్మ కాకపోతే ఇంకెవరు చెప్తారు?' అనుకుంటూ పాలను ఊరంతా తిరిగి అమ్మేది. కానీ తన రాజకుమారుడి బొమ్మను జానమ్మ తుడిచివేసినప్పుడు మాత్రమే 'అమె' తల్లికాదని తెలిసింది ముత్యాలుకు. ఖాళీ అయిన రాజకుమారుడిస్థానంలో, మరెవరి బొమ్మా గీచుకోదలచులేదు ముత్యాలు.

అందుకే రాములుతో తనకు మనువు నిశ్చయించారని విన్నప్పుడు జానమ్మముందు అవాక్కయి నిలుచుండిపోయింది ముత్యాలు. 'ఏం మాట్లాడవ్? రెండో పెళ్లివాడనా? మీ అయ్య నన్ను జేసుకున్నదిమాత్రం రెండో మనువుగాదూ? నోర్మూసుకుని బుద్ధిగా జేసుకో' అంటూ నెత్తిన రెండు మొట్టినప్పుడు కళ్లల్లోకి నీరు ఊరాయి ముత్యాలుకు. ఆ కన్నీళ్లలోనే రాములుతో పెళ్లి జరిగిపోయింది.

ఆ రాత్రి తల్లి పూజచేసుకొనేచోట నిలుచుని, అమ్మను తలుచుకొనీ, చెరిగిపోయిన రాజకుమారుడి బొమ్మను తలుచుకొనీ ఎంతోసేపు ఏడుస్తూ ఉండిపోయింది ముత్యాలు.

* * *

చంద్రాయ్ స్పర్శతో త్రుళ్లిపడింది ముత్యాలు.

గదినిండా వెలుగు మడుగుకట్టింది. ఊరి రణగొణధ్వనులు చెవులకు సోకుతున్నాయి.

'ఏందమ్మా, నువ్వు నిద్రబోలా?'

'లేదురా. ఇప్పుడే లెగిశా' అంటూ కప్పిపుచ్చింది ముత్యాలు.

చంద్రాయ్ అన్నం అంటూ గోడమీద బొమ్మల్ని లెక్కపెడుతున్నాడు. ముత్యాలు మనసులో ఆలోచనలు వంశవృక్షాన్ని పెంచుకుంటున్నాయి.

'అమ్మోవ్. ముప్పయ్యారే. ఇయ్యాల్లో పురుగెక్కువుందే!' లెఖ్ఖ పూర్తిచేసిన చంద్రాయ్ హఠాత్తుగా అన్నాడు.

ముత్యాలు ఉలిక్కిపడింది. మొహం ఎర్రగా తయారయింది. నిద్రలేని కళ్లల్లో వేడి పొంగింది.

'అమ్మా, నీకు బోల్డన్ని మంచి బొమ్మలొచ్చుగదే. ఈపాడు పురుగుల బొమ్మలెయ్యొద్దే. అసయ్యంగుంటాయి...' చంద్రాయ్ చెయ్యి కడుక్కుంటూ అన్నాడు.

'పురుగులు అట్టాగే ఉంటాయిరా' అంది ముత్యాలు.

చంద్రాయ్‌ని బడికి పంపిన తర్వాత, తను కరణంగారింటికి బయలుదేరింది ముత్యాలు.

'అమ్మగోరూ...' ముత్యాలు కేకకు కమలమ్మ బయటికొచ్చి ముత్యాలును చూసింది. ఎండలో మెరుస్తోంది ముత్యాలు ఒళ్లు. ఒంటిమీద మాసినబట్ట వెలావెలాపోతున్నది. కమలమ్మ తన శరీరం వైపు చూసుకుంది. బిగీ బిగీ లేని ఒళ్లు వెక్కిరించింది. కట్టుకున్న జరీ చీరె మాత్రం ఎండలో తళతళమంటూంది.

మౌనంగా లోపలి కెళ్ళి, చెంబులూ, అంట్లు గిన్నెలూ తెచ్చి ముత్యాలు ముందు పడేసింది వాటిని కడుగుతుంటే ముత్యాలుకు హఠాత్తుగా ఆ మాటలు గుర్తొచ్చాయి.

*　　*　　*

'సిలుము పాత్ర కంటుకున్న సింతపండువే నువ్వు' తనని దగ్గరకు తీసుకుంటూ రాములు అన్న మాటలకు అర్థం తెలీలేదు ఆ మొదటి రాత్రి.

'పిచ్చిదానా, ఇప్పటిదాకా ఇట్టం వొచ్చి నట్టు తిరిగాను. ఆ సిలుమును నువు కడగాలె ముత్తెం!' తనని మాట్లాడనీయకుండా గుండెల్లో ఉంచుకున్నాడు రాములు.

అమ్మతోపాటే పోయిన సుఖం తిరిగొస్తుందనుకోలేదు ముత్యాలు. 'కాసీ పట్టు సడలని చేతుల్లో తనని రాములు పెనవేసుకున్నప్పుడు, ఆప్యాయమైన మాటలతో తనను ఊరడించినప్పుడు, అపకారంలోనే ఓ దోవ చూపించిన జానమ్మకు మనసులోనే దణ్ణం పెట్టుకుంది ముత్యాలు. ఆ సుఖం మిగిలిన జీవితమంతా ఉంచమని, కనిపించని ఎందరి దేవుళ్ళనో అర్థించింది.

తన ఉనికిని ఎప్పుడూ మరవకుండా చేయాలంటే, మనుషులు కోరిన కోరికల్ని తీర్చకుండా ఉండటమొక్కటే ఆ దైవానికున్న మార్గం. అందుకే రాములు, చిట్టిని తీసుకుని ఊరొదలి లేచిపోయినప్పుడు,

# మొగలి పువ్వు

దేవుళ్ళి తలుచుకుంది ముత్యాలు—అసహ్యంతోనే అయినా.

తన ఒంటిమన్న నగలన్నీ రాములు వలుచుకు పోయినందుకు బాధపడలేదు ముత్యాలు వాటికి బదులుగా తన రూపాన్ని ముత్యాలులో మిగిల్చిపోయాడు. అదే భాగ్యమనుకొంది ఆమె. కానీ అది తన దౌర్భాగ్యంగా పరిణమిస్తుందని పుట్టింటికి వెళ్ళేదాకా తెలీలేదు ఆమెకి తండ్రి లేకపోయినా సవతి తల్లే అయినా, ఆమెదీ ఆడమనసే. తన స్థితి చూసి కరగక పోతుందా అనుకుంది ముత్యాలు.

కానీ 'ఒక్కదానివిగా ఎళ్ళి, ఇద్దరుగా వచ్చావా? అయినా మొగుడు దేశాలు పట్టింతర్వాత, నీకు కడుపెట్టా గయిందే?' అన్న జానమ్మ మాటలతో, ముత్యాలు ఆమెని గురించి అనుకున్నది మళ్ళీ అబద్ధమయింది. జానమ్మ నిఖార్సయిన సవతి తల్లి అని తేల్చుకున్న తర్వాత, ఆమె మాటల అగ్గిలో బడి, అపవాదులు పులుముకుని, బూడిద కాదల్చుకోలేదు ఆమె.

భవిష్యత్తును తన శక్తి సామర్ధ్యాల కప్పగించి, జీవితంతో పోరాడ్డానికి నిశ్చయించుకుంది.

*　　*　　*

పగలు మొలిచిన చుక్కలా వెలిగిపోతున్నది ముత్యాలు ఎండలో.

'ముత్యాలూ...'

తలెత్తి చూసింది గుమ్మాని కానుకుని తనవంక చూస్తున్న కరణంగారు.

'ఏం బాబుగోరూ...'

'సాయంకాలం అట్లా ఓసారి కొబ్బరి తోట దగ్గరకు రా. మొక్కలకి పాదులు తియ్యాలి' వెలుపలికొచ్చిన కమలమ్మను చూస్తూ అన్నాడు వెంకట్రామయ్య.

కడిగిన పాత్రల్ని 'ఖణేల్' మంటూ మోగిస్తూ లోపలికి తీసుకెళ్ళింది కమలమ్మ.

ఆవిడ వెళ్ళిన తర్వాత ముత్యాలు లేచి వెంకట్రామయ్యని సమీపించింది.

'అట్టాగే బాబుగోరూ' అంది. ఆమె మొహంలోకి రక్తం ప్రవహించింది.

చీరకొంగు కొసలు ముడేసుకుంటూ వెళ్ళిపోతున్న ముత్యాలును, తలుపు వారగా నిలబడి చూస్తూ ఉండిపోయింది కమలమ్మ.

*　　*　　*

కొలిమిలో కాలి చల్లబడ్డ బంగారంలా సిరెండకాంతుల్ని పరుస్తున్నాడు భానుడు.

తోటవైపుగా నడుస్తున్న ముత్యాలు కంటిముందు ఏవేవో అదృశ్య చిత్రాలు మెదలుతున్నాయి.

పెద్దకాపుగారబ్బాయిలాగా పట్నంలో చదువుకుంటున్నాడు చంద్రాయ్. పెద్ద చదువు, తన ఊహాకందని చదువు కష్టాలకు దూరంగా, కల్మషానికి అతీతంగా, కన్నతల్లి ఆశలకు రెక్కలిస్తున్న చదువు. జవసత్వాలుడిగిన దేహంతో, కళ్ళల్లో సమాధి అయిపోయిన కాంతిని పుంజుకుంటూ ఎదురు చూస్తున్న దామె. తెల్లటి వస్త్రాలతో, చల్లటి చిరునవ్వుతో 'మన కట్టాలు తీరిపోయాయి. పదమ్మా, ఈ ఊరిడిసి ఎళ్ళిపోదాం' అంటున్నాడు వాడు. కాలుపెట్టి మెట్టిన ఊరినీ, జీవితపుగట్టు తెంపిన ఊరినీ విడిచి రాలేకపోతోంది తను. 'నన్నిక్కడే పిడికెడు మట్టి కానియ్యరా. నువ్వెళ్ళి సుఖపడరా నా తండ్రీ!' అంటే వినడం లేదతడు. కొడుక్కి దూరం కాలేకా, అతని నిర్మల జీవితానికి భారం కాలేకా బాధతో తపిస్తోందామె.

ఆలోచనల్లో ఈదుతోన్న ఆమె మనస్సు కాలికి కొట్టుకున్న ఎదురు రాయితో జాగ్రదావస్థలోకి వచ్చింది. బొటనవేలి నుంచి ప్రవహిస్తున్న ఎరుపును చూస్తూ కళ్ళు తుడుచుకుంది ఆమె. 'నా కల కరిగిపోనీకు



దేవుడా, నన్నన్యాయం సెయ్యకురా కసాయోడా' పళ్లుకొరుక్కుంటూ అనుకుంది ముత్యాలు.

ఆలోచనరిచ్చిన బలంతో మందగించిన తత్తరపాటునడక వేగాన్నందుకుంది. తోట చేరుకునే వేళకు, అప్పటికే మరో ఏడెనిమిది మంది చెట్లకు పాదులు చేస్తున్నారు. వెంకటామయ్య పలకరింపుగా నవ్వాడు. బదులిచ్చి, తనూ ఓ గడ్డపలుగుపుచ్చుకుని, నేలను త్రవ్వటం ప్రారంభించింది.

ఆకాశం నుదుటి కుంకుమ చెరిగిపోవడంతో, క్రమంగా వైధవ్యంలాంటి చీకటి నలుమూలలా అలుముకోసాగింది.

నిటారుగా పెరిగి ఒంగిపోయిన చెట్టు బోదేనాసుకుని, ఆ వొంపుని చూస్తూ ఉండిపోయింది ముత్యాలు. ఏతాం తోడుతున్న చప్పుడు, తోటపనివాళ్ల కబుర్ల శబ్దాలు, కొబ్బరిచెట్లు అందిస్తున్న ఈల పాటలూ అస్పష్టంగా చెవులకు సోకుతున్నాయామెకు.

దగ్గరలో అడుగుల చప్పుడు వినపడటంతో త్రుళ్లిపడింది ముత్యాలు. ఎదురుగా నిలబడి, మసకగా కనిపిస్తున్న ఆకారాన్ని చూడగానే జుగుప్స ఆశ్చర్యంగా మారింది ముత్యాలులో.

'అమ్మగోరూ ...' అంది మాట తడబడింది. కమలమ్మ ముత్యాలుకు దగ్గరగా వచ్చింది 'ఇదుగో, ఇది తీసుకో. రేపటి మంచి ఇంటికిరాకు' రహస్యంగా అని, వచ్చి

# మొగిలిపువ్వు

నట్లుగానే నద్దులేకుండా వెళ్లిపోయిందామె.

ముత్యాలు చేతుల్లో నోట్లు పైరుగాలికి ఎగురుతున్నాయి. నాటివంక విప్పారిన కళ్లతో చూస్తోంది ముత్యాలు. ఆమె మనసులో ఆలోచనలు.

చంద్రాయ్ ఆకలితో అల్లాడిపోతున్నప్పుడు, ఇళ్లిల్లూ తిరిగి కండల్ని కరిగించైనా వాటి నోటికి తిండి అందిద్దామనుకుంది తను. తనకండలు కరిగాయి. తన బిడ్డకు సంతృప్తి కలిగింది. కానీ తనలో మటుకు అసంతృప్తి మిగిలిపోయింది.

అలోలక్ష్మణా అని అల్లాడినప్పుడు తనని ఏ తల్లీ కరుణించలేదు. ఏ వ్యక్తి తనకు బొత్తులు బొత్తులుగా డబ్బందించలేదు సరికదా, మొండి చేత్తో చిల్లు దమ్మిడీ విదల్చలేదు.

'నీకు నేనండగా ఉంటాను.' అని చనిపోయిన తల్లిగానీ, బతికి ఉన్న సవతితల్లిగానీ, కనిపించని దేముడుగానీ, స్వార్థం కోసం సహాయం చేసే ఊళ్లోని ఏ ధర్మాత్ములాలుగానీ, వోరారా అనలేదు. కడుపు చేతబట్టుకుని పనిపాటులకై ఇంట్లోకొచ్చి, ఒంటరితనంలో మునసబు అపహాస్యానికి గురైనప్పుడు, తెలిసీ తన బ్రతుకుకు ఆదుకుంటానని అభయం ఇవ్వలేని ఈలోకం, తనకీనాడు అవసరానికి మించి సహాయపడటానికి ముందుకొస్తోంది. అత్తిపండులాంటి లోకం ఇది. స్వార్థంతో పుట్టిన కరుణ దానిది.

ఆనాడే చద్దామనుకుంది తను. బ్రతుకుదామని అనుకోవడం కంటే బ్రతకడం కష్టమని తెలిసినప్పుడు కలిగిన తలపు అది. క్షణక్షణం చావుని భరించలేక చేసుకున్న నిర్ణయమది. ఈ భూమికి తన బరువు తగ్గించాలనుకుంది. కానీ కడుపులో బరువు వెక్కిరించింది.

కంచే మేసిన జీవితం తనది. తన బిడ్డ కళ్లు తెరవకముందే ఆ దురదృష్టానికి బలి కాకూడదు. లోకం వీవాడ వగతీర్చుకోవాలి. వాడు దాని క్రూరత్వానికి బలి కాకుండా, ఎదురు తిరిగి దాన్ని చూసి నవ్వాలి. తనను తనివితీరా నవ్వించాలి — తన జీవితం పణమైనాసరే!

ఆనాడే తెల్లటి గోడమీద మంబొగ్గుతో బొమ్మలు గీచుకుంది, మొదటిసారిగా.

* * *

'ముత్యాలూ...' కేక పెద్దగా వినిపించింది ఆలోచనల్లోంచి తేరుకుని, ఆ పిలుపుని పట్టించుకోకుండా తోటదాటి ఊరివైపు నడిచింది ముత్యాలు.

వెనక పిలుపు ఇంకా వినిపిస్తూనే ఉంది.

* * *

చంద్రాయ్ ఇంకా మేలుకొనే ఉన్నాడు. తల్లిని చూడగానే వాడి మొహం వికసించింది.

'ఏడకు బొయ్యావే' ముత్యాలుని ముట్టేసుకున్నాడు వాడు. చంద్రాయ్‌ని గుండెలకు గట్టిగా హత్తుకొని కాసేపలాగే ఉండిపోయింది ముత్యాలు. గండిపడ్డ చెరువులా హృదయం విచ్చుకుంది. ప్రేమ పెల్లుబికింది.

అన్నం తిని, అమాయకంగా నిద్రపోతున్న కొడుకుని చూస్తుంటే, వాడి మాటలు మనసులో మెదిలాయి.

'ఈ పురుగుల బొమ్మలెయ్యొద్దే, పొడు అసయ్యం గుంటాయి...'

తరిగిపోయిన చవితి చంద్రుణ్ణి మేఘాలు ఇంకా కప్పేస్తున్నాయి. ముత్యాలు మొహం మీద వెలుగు నీడలు పరుచుకొంటున్నాయి.

'పురుగుల బొమ్మలు, అసయ్యం—' పదే పదే గుర్తుకొస్తున్నాయా మాటలు.

'ఏ కెట్టా సెప్పేదిరా వాయనా! నేను



గసిన పిచ్చిగీతలు కావురా అవి. బగమంతుడు రాసిన శిలాశాసనపు రాతలు'

నిప్పును కప్పిన నివురు ఎగిరిపోయి, ముత్యాలు గుండె కణకణం మండసాగింది. కణ కణ కాలిపోతున్నది.

రోజూ అనుభవమయ్యే బాధే ఆమెకది. జీవిత నావను ముంచేస్తున్న ఆ తుఫాను నుంచి తప్పించుకోవాలని ఎన్నోసార్లు అనుకున్నా ఆమె అలా చేయలేక పోతోంది. పెనుగాలిని తప్పించుకున్నా, మిగిలేది కటిక చీకటేనని ఆమెకు తెలుసు. అగాధ తిమిరంలో తను నమ్ముకున్న కొయ్యముక్క చేజారిపోతుంది. అలలకు తగిలి, ఛిన్నా భిన్నమై సముద్రగర్భంలో కలిసిపోతుంది! ఆ సాహసం ఆమెకులేదు. అందుకే భయంకరమైనా, తుఫాన్ నే కోరుకుంటోంది ఆమె మనసు.

ఆరోజు ఆమె మనస్సు, ఎన్నడూ లేనట్లుగా అల్లకల్లోలమై పోయింది. ఏదో భీతి, ఏమిటో అనుభూతి ఆమెను ముట్టేశాయి. కంటిముందు దృశ్యాలు మసక బారుతున్నాయి. నిర్జీవ ప్రతిమలా కూచుండి పోయింది.

ఒక రాత్రివేళ తలుపులు 'కిర్రు' మని తెరుచుకున్న శబ్దం, పరిచయంలేని అడుగుల చప్పుడు.

భ్రమేమో అనుకుంది. కాదు నిజంగానే ఎవరో సమీపిస్తున్నారు. ఆశ్చర్య పడిందామె భయం వెయ్యలేదు.

'ఎవరు?' కీచుగొంతుకతో అంటూ దీపం వత్తిని పైకెగదోసింది. వెలుగు వాకిలికి పాకింది.

ముత్యాలు స్తంభించి పోయింది.

ఎదురుగా రాములు!!

అతని కళ్లల్లో వెలుతురు. ఆ వెలుతురులో ఆశ, వశ్చాత్తాపం, ప్రేమ, ఇంకా ఏమిటో తెలీని భావాలు పెనవేసుకుని ఇంద్రచాపంలా మెరుస్తున్నాయి. ఆమె కళ్లల్లో సంకోచం, భయం, చాంచల్యం కారు మొయిలులా కమ్మి తొలిచేస్తున్నాయి.

'ముత్తెం—' ఎన్నాళ్ల క్రితమో విని పించటం మానేసిన, ఇక ఎన్నాళ్లకూ వినిపించదని ముత్యాలు అనుకున్న పిలుపు, తియ్యగా వినిపిస్తోంది, పిడుగులా దహిస్తోంది.

ఆమె వలికేటంతలో, రాములు ఆమెని గాఢంగా కావలించుకున్నాడు.

రాములు కళ్ళలోంచి పన్నీరు స్రవిస్తోంది. ముత్యాలు కంట్లోంచి కన్నీరు ఉరుకుతోంది. అది, సప్తసాగరాలూ పొంగి జలప్రళయం వచ్చిన సమయం. క్షీరసాగర మధనంలో కాలకూటం చిమ్మిన క్షణం.

ఆ సంక్షోభం ముగిసిన తర్వాత, అమృతంలా నవ్వింది ముత్యాలు. మనసారా, తనివి తీరా, గుండెల లోతుల్లోనుంచి వెలువడ్డ నవ్వది.

'ఇన్నాళ్లకు దయగలిగిందా మావా…!' ముత్యాలు గొంతు బొంగురుపోయింది. ఆ మాటల్లో 'ఎన్నాళ్ళకొచ్చా'వన్న నిష్ఠూరం 'కొన్నాళ్లు ముందుగావస్తే ఎంత బాగుండేది' అన్న తహతహ. బీడుగా మారిన భూమిమీద కురిసిన వానను తలుచుకుని తపన.

ఆప్యాయంగా ముత్యాలు కలిపి నోటికి ముద్దలందిస్తూంటే, ఆ పురావురుమని తింటూ రాములు కబుర్లు చెప్తున్నాడు, తనకు జీవితంలో ఏది కావాలనుకున్నాడో, తనకు జీవితం ఏమిచ్చిందో కిష్టయ్యని ఒదిలేసి తనవెంట లేచొచ్చిన చిట్టి, తన నొదిలి ఎట్లా లేచిపోయిందో, అప్పటికీ తనకు కావలసినదేమిటో తెలియక దేశాలు పట్టుకు ఎలా తిరిగాడో చెప్పుకు పోతున్నాడు. సిగ్గులేకుండా, నిష్కల్మషంగా.

'నువ్వులేనిచోట నాకేంలేదని తెలిసిం తర్వాత తిరిగొచ్చానే ముత్తెం' అంటున్నప్పుడు రాములు కళ్లు చెమ్మగిల్లాయి.

'ఛ, ఏడుస్తుండావా ఆడదానిలాగా. ఊరుకో మావా…నా దగ్గరికొచ్చేశావుగా. ఇంకేడకీ బోమాకు, నాకు నువ్వూ. నీకు నేనూ…' రాములు నోదారుస్తోంది. తనను ఓదార్చుకోవడం తెలీని ముత్యాలు.

'సూడు, నువ్వు వన్నొదిలి పోయిం తర్వాత పుట్టిన నీ బిడ్డ ఎంతోడయ్యాడో…' చంద్రాయ్ ని చూపించింది.

వంగి, నిద్రపోతున్న చంద్రాయ్ తల మీద ముద్దు పెట్టుకున్నాడు రాములు.

ముత్యాలు ఆనందంతో ఉక్కిరి బిక్కిరయింది. నెమలిలా పురివిప్పుకున్న మన



# జీవన్ టోన్

గవర్నమెంటు రిజిస్టర్డు నెం 218726

Phone No. 440206



మందు తీసుకొనక ముందు | 20 దినములు తీసికొన్న తర్వాత | 40 దినములు తీసికొన్న తర్వాత | 60 దినములు తీసికొన్న తర్వాత

పత్రికలలో ప్రకటనచేసిన ఔషధాలను సేవించి ఫలితాలను పొందనివారు అనేకులున్నారు. కాని జీవన్ టోన్‌ను కొనుక్కుని దానిని ఉపయోగించి ప్రయోజనం పొందండి. జీవన్ టోన్ కేవలం వనస్పతి కొవ్వునుంచి తయారుచేయబడినది. జంతువులకొవ్వు చేరుటవల్లనే ఈ అనుకోనటువంటి బలిష్టతను కారణం అని కొందరు అనుకోవటం పొరపాటు.

**జీవన్ టోన్ గుణములు:** ఎంత మంచి ఆహారము తిన్నా ఎముకలపోగువలె, బలహీనంగా ఉండేవారు కొంతమందిఉన్నారు. అట్టివారికి జీవన్ టోన్ మంచి బలాన్ని, లావును, బరువును ఇస్తుంది. ఆకలి లేనివారికి మంచి జీర్ణశక్తి నిస్తుంది. ఇది బలహీనత, కాళ్లుచేతులు తేలిపోవుట, తలతిరుగుట, రక్తహీనతలను పోగొట్టి, పరిపూర్ణమైన దేహారోగ్యాన్ని, పుష్టిని ఇస్తుంది. శరీరం ఎరుపుఛాయ పొందటానికి జీవన్ టోన్‌తో టొమాటోలు తీసుకొనండి. ఆరోగ్యవంతులకు కూడ జీవన్ టోన్ మంచిది. జీవన్ టోన్ తీసుకొన్నప్పుడు మీరు కొంత శరీరవ్యాయామం చెయ్యటం అవసరం. లేకపోతే మీ శరీరం అనవసరంగా లావెక్కుతుంది. కావలసిన బరువు, బలిష్టత చేరినవెంటనే జీవన్ టోన్ సేవించడం నిలపడం మంచిది. స్థూలకాయులు జీవన్ టోన్ తీసుకొనుట మంచిదికాదు. అట్టివారు జీవన్ టోన్ తీసుకుంటే మేము బాధ్యులం కాము. స్త్రీలు బహిష్టుకాలంలో తీసుకొనగూడదు. ఇతర వివరాలు మందుతో పంపబడతాయి.

వెల: 454 గ్రాములు రూ. 10/-. పోస్టు చార్జీలు అదనం.

స్కిన్ లీమ్స్ యవ్వనసౌందర్యం కలిగియుండటం వరప్రసాదం. స్కిన్ లీమ్స్ మీ చర్మాన్ని, మొటిమలు, పోటకపు మచ్చలు, నివర్ణత, కోతలు, శోభినుంచి కాపాడుతుంది. స్కిన్ లీమ్స్ ముఖమందలి మట్టి తొలగించిన తరువాత వాడవలయును. మీరు ఏ స్నోనుగాని, పౌడరునుగాని వాడవచ్చును. స్కిన్ లీమ్స్ ఒక కోర్సు రు. 12/-

**JOTHI HOSPITAL,** POST BOX No 1413. 32. VENKATANARAYANA ROAD. MADRAS-17.

స్థానిక డాక్టరు: డాక్టర్ దామోదరం, M A I A D.S

# మొగలిపువ్వు

మ్పుతో, ఒళ్ళంతా కళ్ళు చేసుకుని ఆ దృశ్యాన్ని చూసింది. ఒక్కసారిగా మావ కాళ్ళకు చుట్టేసుకుపోవాలనుకుంది 'నామీద ఈ పాపిష్టిలోకానికి కలగని నమ్మకం నీక్కలిగిందా మావా...' అని చెప్పాలనుకుంది. కాని గొంతు పూడుకుపోయింది.

అదురుతున్న పెదాలతో 'మావా' అని మాత్రం అనగలిగింది.

ఓక్షణం అచేతనమై పోయిన ముత్యాలు, రాములు మాటలతో అదిరి పడింది.

'ముత్తెం, గోడమీద ఆ పిచ్చిబొమ్మ లేంటే, ఏ సీతారాములో గీసుకోక' గోడ మీది బొమ్మల్ని అయోమయంగా చూస్తూ రాములంటూంటే, ముత్యాలు తడబాటు పడింది.

'ఏం లేదులే మావా పొద్దుపోయింది రేపు మాట్లాడుకుందాంలే, పడుకో—' మాట తప్పిస్తూ అన్నది.

రాములింకేమీ అడగలేదు. ఏళ్ల తర్వాత తిరిగొచ్చిన ఆ రాత్రిని వృధా చెయ్యదల్చుకోలేదతను. ముత్యాలును పొదివి పట్టుకుని దగ్గరకు లాక్కుంటున్నాడు.

చలించి పోతున్న తనువునీ, మనసునీ బిగించి పట్టుకోవడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తోంది ముత్యాలు.

'ముత్తెం,' ఇన్నేళ్ళు గడిచినా ఇంకా పువ్వులాగానే ఉండావే' రాములులో ఆవేశం పెరిగి పోతోంది.

ముత్యాలు మనసులో విస్ఫు రవ్వలు రేగుతున్నాయి.

'మొగిలిపువ్వును మావా—విన్నంటలేను' అని చెప్దామనుకుంది. మాటలు గొంతులోనే కొట్టుకులాడుతున్నాయి.

ప్రయత్నం మీద విడిపించుకుంటూ, 'పడుకోమావా, ఇయాల సుక్కురోరం.' అన్నది.

రాములు గాఢనిద్రలో మునిగిపోయిన తర్వాత, తూలుతూ లేచి గోడ దగ్గరికి నడిచింది ముత్యాలు.

గోడమీద వలయాకారంగా బొగ్గుతో గీచిన రెక్కల పురుగులు. భయంకరంగా, నల్లగా, అసహ్యంగా ఎగురుతున్నాయి. మధ్యగా మొగిలి పువ్వు నీరసంగా నవ్వుతోంది.

గూట్లోంచి బొగ్గు తీసుకుని, ముత్యాలు ఆ మొగిలిపువ్వు పక్కగా ఓ తుమ్మెదని గీచింది. అందమైన రెక్కలతో, ఠీవిగా, అధికారంతో ఎగురుతున్న తుమ్మెద పువ్వుని తమ నీడకింద కప్పేసేటంత పెద్ద రెక్కల భ్రమరం!

ఎదురుగా రెక్కల పురుగులు నవ్వుతున్నాయి, పరిహాసంగా. కసిగా వాటి నన్నిటినీ గోడమీద నుంచి చెరిపేసింది ముత్యాలు. అవి చెరిగిపోయిన ప్రదేశంలో గుండ్రంగా నల్లటి మచ్చలేర్పడ్డాయి.

అసహనంగా నిల్చుండి పోయింది ముత్యాలు. కళ్ళు నీళ్లతో నిండిపోయాయి. ఆవేశంగా ఆ మరకల్ని మళ్ళీ మరోకసారి తుడిచెయ్యడానికి ప్రయత్నించింది, మరకలు గోడ నిండా అలుముకున్నాయి. తెల్లటి గోడంతా మసితో నిండిపోయింది.

నిస్సహాయతలో దుఃఖం ముంచుకొచ్చింది ముత్యాలుకు. ఎన్నాళ్ళక్రితమో మరిచిపోయిన ఏడుపు. ఇన్నాళ్ళూ మనసులోనే జల్లులా వర్షిస్తున్న ఏడుపు, హోరున దూకే జలపాతంలా, వడగండ్లవానలా వెలికి వచ్చింది.

ఎంతోసేపు అలా ఏడుస్తూనే ఉండి పోయింది ముత్యాలు.

* * *

'ముత్తెం...' కళ్ళు నులుముకుంటూ లేచి కూర్చున్న రాములు పిలుపుకు జవాబులేదు. అటూ ఇటూ చూశాడు. ఇంట్లో ఎక్కడ కనిపించలేదు.

కారు మబ్బుల్ని చీల్చుకుంటూ సూర్యుడు పగలబడి నవ్వుతున్నాడు. ఆ నవ్వు రేకులు రేకులుగా కిటికీలోనుంచి ఇంట్లోకి ప్రవహిస్తోంది

'ఏడకి పోయినట్టు ఇంత పొద్దున్నే...', అనుకున్నాడు రాములు. అతని దృష్టి అప్రయత్నంగా గోడమీద నిలిచింది.

గోడమీద ఓ తుమ్మెద ఎగురుతోంది. దానిచుట్టూ గుండ్రంగా నల్లటి మరకలు. దాని పక్కగా పువ్వుండాల్సిన చోటులో మరో నల్లటి మరక!

రాత్రి తను చూసిన పురుగులూ, పువ్వూ ఏమయ్యాయో, ఇప్పుడీ తుమ్మెద బొమ్మ ఎక్కడిదో అర్థం కాలేదు రాములుకి.

ఏదో గోల వినపడుతుంటే, దిగ్గునలేచి ఇంటిముందు కొచ్చాడు రాములు. ఎవరో హడావుడిగా పరుగెత్తుతున్నారు. ఒకర్ని ఆపి సంగతేమిటో అడిగాడు.

'ముత్యాలు కాలుజారి బావిలోపడి సచ్చిపోయిందట.'

ఆపైన అతను చెప్పిన మాటలు, రాములు 'ముత్యాలూ' అంటూ అరిచిన గావుకేక కింద దాగిపోయాయి.



# జీవనరాగం

ఉన్నవ విజయలక్ష్మి

### జరిగిన కథ

ఇద్దరు అన్నయ్యలకి, ఇద్దరు అక్కయ్యలకి ముద్దుల తమ్ముడు నిరంజనం. అందరితోకీ వచ్చగావున్నవాడు అతను. అతనికి భార్య పోవడంతో అత్తగారు సీతమ్మగారిచే యజమాయిషీ. పెద్దక్కయ్యకి జబ్బుగావుందని టెలిగ్రాం వస్తుంది. పెద్దక్కయ్యంటే నిరంజనానికి ప్రాణం. వెంటనే బయలుదేరి వెళ్లాడు. వసంత నిరంజనం కూతురు. ఆమెకి చాల గొప్ప సంబంధం చేయాలని సీతమ్మగారి వాంఛ. వసంతని చూడ్డానికి పెళ్లివారు వస్తున్న సమయంలోనే ఈ అవాంతరం రావడంవల్ల సీతమ్మగారికి వొళ్లుమండుతుంది. అన్నీ సక్రమంగానే జరిగి, వసంత పెళ్లి అయిపోతుంది. నిరంజనం పెద్ద కొడుకు మధు. పట్టభద్రురాలయిన అమ్మాయి సుధతో అతనికి పెళ్లవుతుంది. సీతమ్మగారికి సుధకి ఆట్టే పడడం లేదు.

## 5

కిటికీలోంచి అదంతా చూస్తున్న సీతమ్మగారికి గంగవెర్రులెత్తినట్లే అయింది.

'అయ్యో అయ్యో, ఎక్కడయినా వుంది ఇలా. తోడిననీళ్లు లేకపోతే, మొగుడు వచ్చే వేళ్టికి నీళ్లు సబ్బు అవి సిద్ధంగా వుంచడం పోయి వాడిచేతే తనకి కావలసిన నీళ్లన్నీ తోడించుకుంటోంది — వాడూ సరే, తడి మొహంతో నానిపోతూ నీళ్లన్నీ తోడిపోస్తున్నాడు. క్షుద్రనాగమ్మనిచేసి ఆడిస్తోంది—ఇంట్లో పనీపాటాలేకుండా ఇలా కేరింతాలు కొట్టమంట్లే ఎంత సంతోషంగానయినా వుంటుంది దానికి' అని బుగ్గలు నొక్కుకుంది.

అయితే పరాయిపిల్లని గురించి తను ఇన్ని అనుకుంటోంది కాని తన పెంపకంలో గారాబంతో రణపెంకిగా తయారయిన వసంత కూడ అక్కడ అలాగే వుంటుందేమోనన్న ఆలోచన ఆవిడకి ఒక్కనాడూ రాలేదు. అలాంటి సందర్భం వచ్చినా ఆపిల్లయందు గల అభిమానమూ, ఎప్పుడూ అవతలివాళ్ల మీదే నెపంవెయ్యగల నేర్పూ ఆవిడ మరోలా ఆలోచించకుండా చేశాయి. లేకపోతే ఈ ఏడాదిగా వసంత వచ్చినప్పుడల్లా అత్తవారింటి కబుర్లకి చిలవలు పలవలు కల్పించి చెప్తూంటే, 'అయ్యో తల్లీ, కాలుక్రింద పెడితే కందిపోతుందేమోనన్నంత ముద్దుగా పెంచాను. చివరికి వాళ్లింట్లో అడ్డమయిన చాకిరీ చేయాల్సి వచ్చిందా—అయినా చేతకాకపోతే మెల్లిగా చెప్పుకో కూడదూ మీ అత్తగారు. అలా సూటీపోటీ మాటలతో మనసు కుళ్లబొడవటం ఎందుకు—మీ ఆయనయినా తల్లికి నచ్చచెప్పడేం' అంటూ వాళ్లమీద విరుచుకుపడేది కాదు.

* * *

దసరా పండగకి వసంత వచ్చింది.

'అబ్బ. ఎన్నాళ్లయిందే చూసి కళ్లు కాయలు కాచిపోయాయంటే నమ్ము—' సీతమ్మగారు ఆప్యాయంగా పలకరిస్తూంట్లే,

'ఆరునెలలకేనా?' అన్నాడు మధు అమ్మమ్మని కవ్విస్తున్నట్లు.

'నీకిప్పుడింక అలాగేవుంటుందిలే అదివరకయితే చెల్లాయి ఎప్పుడువస్తుందా' అంటూ ఎదురు చూసేవాడివి' మనవడు మరి నోరెత్తకుండా చేశాననుకున్నాక, 'అయితే మీతోటి కోడలు కాపరానికొచ్చిందా' అంటూ మనవరాలితో మాటల్లోకి దిగింది.

'ఊహూ. ఏదీ పెళ్లి హడావిడి అయేసరికి శూన్యమాసం వచ్చిందన్నారు. ఈ పండగ వెళ్లాక వస్తుందిట.'

'అల్లుడు పండగనాటికయినా వస్తాడామ్మా' అన్నాడు నిరంజనం.

'ఏడాది దాటిపోయినా ఇంకా కొత్తల్లుడివా ఏమిటి రానన్నారు. పైగా శెలవు కూడ ఎక్కువగా వుంది' అంది వసంత.

'నయమే. ఏడాది దాటిపోతే ఇంక పండగలకి రాకూడదా ఏమిటి. దసరాకి వీలులేకపోతే దీపావళికయినా తప్పకుండా పంపమని ఉమాపతికి రాస్తాను' అన్నాడు నిరంజనం.

'అప్పుడొచ్చి అమ్మాయిని కూడ వెంట పెట్టుకుపోతానంటాడేమో. వసూని ఓ రెణ్ణెల్లపాటు వుంచుకుంటామని ఇప్పుడే వ్రాయి' అంది సీతమ్మగారు.

ఆ సాయంత్రమే సుధ మధుకూడ సుధ వాళ్ల వూరు వెళ్లారు.

పండగ హడావిడి అయిపోయింది. మధు అత్తవారింటినుంచి వచ్చేశాడు.

ఆదివారం మధ్యాహ్నం అంతా నట్టింట్లో కూర్చుని ఫలహారం చేస్తున్నారు. సీతమ్మగారు వంటింటి గడపలో నిలబడింది. కొంచెంసేపు ఆమాట ఈమాట అయాక,

'వసూ సంసారం పరిస్థితి ఏమీ బాగుండలేదు' అంది.

నిరంజనం, మధు ఇద్దరూ తెల్లబోయి ఒక్కసారే తలెత్తి చూశారు. వసంత తల వంచేసుకుని పకోడీలు లెక్కపెట్టసాగింది.

'మరీ సవతిపు కొంప—అంతమందికి చాకిరీ చెయ్యలేక పిల్ల ఎలా ఆర్చుకుపోయిందో చూశారుగా. వచ్చేసరికి బొత్తిగా కళ్లల్లో వున్నాయి ప్రాణాలు—అంత కాల్చుకు తింటూంటే ఎన్నాళ్లని మనం చూస్తూ వూరుకుంటాం...'

ఆవిడ చెప్పబోయేది ఏమిటన్నట్లు తండ్రీ కొడుకులు ఓసారి మొహాల్లు చూసుకున్నారు.

'అయితే వాళ్లతో పోట్లాడమంటావా?' అన్నాడు మధు హాస్యధోరణిలో.

'పోట్లాట ఎందుకూ. చేసేదేదో మాట్లాడకుండా చేసి చూపించాలి. మాటలతో పనిలేదు.' అందావిడ, నీకేం తెలియదు నోరు మూసుకో అన్న ధోరణిలో మనవణ్ణి చూస్తూ.

ఆవిడ చెయ్యనున్నదేదో అందరికీ అర్థం అయినట్లే వుంది. నిరంజనం ఆయోమయంగా తలెత్తి చూశాడు.

'మన్నొకసారి వెళ్లి ఆ వియ్యంకుడితో

## క్యాలెండరు బహుమతి

**4 కూపన్‌లు పంపిన ప్రతి పోటీదారు పెద్ద సైజు గోడ కాలెండరు ప్రతి నాలుగు కూపనులకు ఉచితంగా పొందగలరు.**

## 17 CLUES

1. The face of Nature as presented to us is infinitely varied, but to those who love her it is ever **Beautiful / Wonderful** and interesting
2. The highest form of Beauty / **Morality** is that which is joyful and spontaneous, and the highest form of art is that which can transform nature itself into its theme.
3. The natural condition of all living beings is the condition of **Calmness / Happiness**
4. If **Civilization / Education** is to be bound up with material advancement we must accept its inevitable consequence, loss of freedom in exact proportion to the forward march.
5. We must face the hard truth of history that mere political merger does not lead to national unity, unless there be an under current of **Cultural / Emotional** unity.
6. There will always be a gulf between principles and practice between the ideal and the actual That is unavoidable in this **Deceptive / Defective** world.
7. Even **Defeat / Despair** is a grim teacher when one doesn't lose balance.
8. In the small as well as in the big things of life, we have to sacrifice ourselves, our desires, our interests, our ambitions for the **General / National** good
9. Ego is not pride alone as commonly thought. It can lurk very well in **Humility / Sanctity** too.
10. Unfortunately, the world is so constituted that **Ideal / Moral** conduct more often than not pays no dividends in material goods or comfort
11. All the great **Ideals / Ideas** of humanity are pangs born
12. So long as life lasts nothing can be **Ignoble / Inactive**
13. The artist's approach to **Infinity / Reality** is different from both the scientist's and the religious man's.
14. If freedom, if democracy, is to survive in the world along with **Justice / Peace**, then we must look to religion with its faith in man to realize it for us.
15. **Affection and Loyalty / Magnanimity** are of the heart, they cannot be purchased in the market - place much less can they be extorted at the point of the bayonet
16. In India cultural diversity is most pronounced in the realms of religion and philsophy while the realm of the individual in economic and **Political / Social** matters needs to be widened.
17. **Selfishness / Weakness** of any kind is the root of all evil.

**గమనిక :** పై క్లూలు గ్రంథకర్తలు, రచయితల పుస్తకముల నుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంత మైనవి. గ్రంథకర్తలు రచయితల పేర్లు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తోపాటు టిట్ క్యాట్ పత్రికలో ప్రచురించబడును.

తెలుగు అనువాదం వచ్చే వారం పత్రికలో చూడండి.

# జీవనరాగం

డీగా రా, ఓ పది రోజులపాటు ఇద్దరం కలిసి సరదాగా ఎక్కడికయినా వెళ్లివద్దాం అంటూ అతను బోలెడు ఉత్తరాలు రాశాడు. ఈ క్రిస్మస్ శలవల్లో వెళ్దామనుకున్నాను. ఇంట్లో ఏవో గొడవలు జరుగుతున్నప్పుడు నేను వెళ్తే, ఇన్నాళ్లు రాలేదు ఇప్పుడు ఒడిదో చూడటానికే వచ్చానని వాళ్లనుకోగలరు కూడ. అందుకే ఆ ప్రోగ్రాం కూడ కాన్సిలు చేసుకుంటాను. వాళ్ల మంచిచెడలు వాళ్ళే చూసుకోవలసిందే.' కొడుకువంక తిరిగి చెప్పి కాఫీగ్లాసు తీసుకుని లేచి వెళ్లిపోయాడు నిరంజనం.

'నువ్వయినా చెప్పిచూడు నాయనా. మీ అమ్మే వుంటే ఇలా చూస్తూ వూరుకోగలిగేదా ?' మనవడితో చెప్పుకుని కళ్లు తుడుచుకుంది సీతమ్మగారు.

వెనకనుండి వచ్చిన ఆ విసురు ఛెళ్ళున కొరడాతో కొట్టినట్లయి, గుండె విల విలాడిపోతుంటే తల వంచుకుని గదిలోకి వెళ్లిపోయాడు నిరంజనం.

తండ్రివెనకే లేచిపోయిన మధుని కూర్చోపెట్టి వసంత, సీతమ్మగారు ఎన్నో విషయాలు చెప్పటం మొదలుపెట్టారు.

* * *

కోపం, అవమానం, బాధ అన్నీ కలిసి నిరంజనం అంతరంగాన్ని అల్లకల్లోలం చేస్తున్నాయి— నువ్వుంటే ఈ సమయంలో ఏం చేసేదానివి మీనాక్షీ. చెప్పు నా అభిప్రాయం పొరపాటా—నేను పిల్లల్ని అభిమానంగా చూసుకోటంలేదా—ఎన్ని చేసినా చివరికి నువ్వు లేనిలోటు తీర్చలేక పోయాను. అన్ని బాధ్యతలు నా ఒక్కడి మీదపెట్టి నువ్వు వెళ్లిపోయావు—'

కాఫీ కాస్త తాగేసరికి చేదుగా అనిపించింది. 'చక్కెర చాలలేదేమో, లేకపోతే మనస్సు బాగుండక నా నోటికే రుచి తెలియటంలేదో — జీవితంలో చాల భాగం చేదుని జీర్ణం చేసుకోటంతోనే గడపగలిగిన నేను ఈ కాస్త చేదు భరించలేకపోవటం ఏమిటి—హు.' విరక్తిగా నవ్వుకున్నాడు.

నిజం చెప్పాలంటే తల్లి మరణంతోనే తనకి చేదు జీవితం ప్రారంభం అయింది అనిపిస్తోంది — బాగా జ్ఞానం వచ్చీ రాక ముందే తండ్రి పోయినా తల్లి ఆదరణతో బాల్యంలో ఆ దుఃఖం తెలియలేదతనికి. తన దుఃఖాన్ని లోలోపలే దిగమింగి, పిల్లలు ముఖ్యంగా చిన్నవాడు నిరంజనం బెంగ పెట్టుకోకూడదని ఎంతో అపురూపంగా చూసుకుందావిడ. అందువేతే ఆ లోటు అంతగా బాధించలేదు కాని తల్లి పోయిన నాడు మాత్రం జీవితంలో మొదటిసారిగా భరించలేని దుఃఖం అంటే ఏమిటో అనుభవంలోకి వచ్చింది—'నీ నిరంజనం ప్రయోజకుడయ్యేదాకా నయినా వుండకుండా వెళ్లిపోయావమ్మా' అంటూ కుమిలిపోయాడు.

అతని కింకా బాగా జ్ఞాపకం వుంది — కొడుకుని చూసుకుని సంతోషంగా మద్రాసు తిరిగి వచ్చాడు. కళ్ళు మూసినా తెరచినా పసివాడి అమాయకమైన మొహం, వాడిని ప్రేమగా గర్వంగా గుండెలకి హత్తుకొంటున్న మీనాక్షి రూపు కనిపిస్తున్నట్లే వుండేది— పగలంతా వాడిని వళ్లో పడుకోబెట్టుకుని మురిసిపోయేదే కాని రాత్రులు మాత్రం తన దగ్గర పడుకోబెట్టుకోనిచ్చేది కాదు. —అస్తమానూ పక్క తడిపేస్తాడు బాబిగాడు, నా చీరంతా తడిసిపోతుంది. అంటూ వాడికి వేరే పక్క వేసేది. ఓ రాత్రివేళ కొంత మురిగిపోయినట్లు కలయ మనేవాడు.

'ఏ చీమయినా కుట్టిందేమో—పక్క దులిపివేశావా' అంటూ హడావిడి పడిపోయేది సీతమ్మగారు. తీరా చూస్తే ఏమీ వుండేది కాదు. మీనాక్షి ప్రక్కలో పడుకోబెట్టుకునేసరికే అంతా ఏడుపు మంత్రం వేసినట్టుపోయేది — వాడు గాఢంగా నిద్రపోతూండగా మీనాక్షి లేచి వెళ్లిపోయేది. అందరికీ కాస్త నిద్రపట్టేవేళ్ళకి బాకా వూదినట్లే మళ్ళీ గొంతు విచ్చుకునే వాడు.

'చెప్తే వినవమ్మాయ్—తల్లి డొక్కలో దూరి పడుకుంటే వాళ్ళకి వెచ్చగా హాయిగా వుంటుంది. వానాకాలం కూడాను ఒక్కడ్నీ విసిరేసినట్టు దూరంగా పడుకోబెడితే ఏడవకేంచేస్తాడు' అని మందలించేది తల్లి.

అదంతా గుర్తు వచ్చి చదువుతున్న పుస్తకం ప్రక్కన పెట్టి కాగితం కలం తీసుకున్నాడు. 'నువ్వు మరీ వెర్రితనం చేస్తే పసివాడు ఝడుసుకుంటాడు. జాగ్రత్తగా చూసుకో.' అని వుత్తరం వ్రాయాలనుకున్నాడు.

**ఆ సమయంలోనే వచ్చింది టెలిగ్రాం.**

తల్లికి సీరియస్‌గా వుందని వెంటనే బయలు దేరి రమ్మని.

ఇంటికి వచ్చాక వివరాలు తెలిశాయి. పెరటి చీడీలమీద కాలుజారి పడిందావిడ. మడుందగ్గర ఎముక విరిగింది. అది సెప్టిక్ అయింది—నిరంజనం దగ్గర వుండగానే ఆవిడ కళ్లు మూసింది. ఇంక నేనిప్పుడేమీ చదవలేను అంటూ రోజుల తరబడీ లోలోపలే కుమిలిపోయే అతన్ని అన్నయ్యలు అక్కయ్యలు బలవంతంచేసి మద్రాసు పంపించారు.

పరీక్షలు వ్రాసి అతను ఇంటికి వచ్చేసరికి పెద్దన్నగారికి ట్రాన్స్‌ఫరు ఆర్డరు చేతికి వచ్చింది. చిన్నన్న చాలా కాలంనుండి పై వూళ్లల్లోనే వుంటున్నాడు.

ఇంక ఎవరి సంసారం వాళ్ళుగా అయిపోయినప్పుడు ఆస్తి కూడ పంచేసుకుంటే తీరిపోతుందని ఎవరో ప్రతిపాదించారు.

మొదట్లో బాధ అనిపించినా తల్లీ తండ్రీ అంటూ పెద్దవాళ్ళెవరూ లేనప్పుడు అది అనివార్యమే అనిపించింది. ఆస్తి అంటూ ఎక్కువేమీ లేదు. ఉంటున్న యిల్లు కొద్దిగా పొలం

'ఉద్యోగాలతో దేశంమీద తిరుగుతున్నాం మేము. నువ్వు ఇక్కడే వుండి

# జీవనరాగం

ప్రాక్టీసు చేసుకునేవాడివి ఇల్లు నువ్వే తీసుకో. అందులో మళ్ళీ వాటా లేమిటి?' అన్నారు అన్నగార్లు.

అది నిరంజనానికి కూడ బాగానేవుందని పించింది.

ఉన్న పొలం తక్కువ. దాన్ని ఇద్దరు పంచుకోవాలి అందుకే ఇంటి విలువనిబట్టి అన్నగార్లిద్దరికీ డబ్బు ఇవ్వాల్సివచ్చింది.

'మా అమ్మ నడుగుదాం' అంది మీనాక్షి.

'ఎందుకూ ఇవాళే ఇమ్మని వాళ్లేం బలవంతం చేస్తున్నారు కనుకనా. అన్నయ్యలకే నెమ్మదిగా తీరుస్తాను' అన్నాడతను.

ఎవరి సంసారం వాళ్ళు ప్రారంభించారు. మీనాక్షికి బొత్తిగా చిన్నతనం. ఆ మాట కొస్తే నిరంజనానికి మాత్రం ఎన్నేళ్లన్నాయని. వంటవాడికి వళ్లు నెప్పి బడిందనేసరికి హడలిపోయి సీతమ్మగారికి ఉత్తరం వ్రాశారు. తిరుగు రైలులో వచ్చి వాలిందావిడ.

మీనాక్షికి అన్నదమ్ములూ అక్కచెల్లెళ్ళూ ఎవరూ లేరు తండ్రి ఆ పిల్ల చిన్నతనంలోనే పోయాడు అందుకే,

'ఒక్కదానివీ ఆ గూళ్లో ఏం వుంటావు ఆ ఇల్లు తాళం వేసెయ్. నా దగ్గరే వుండిపో' అంటూ మొదలు పెట్టింది




కూతురుగూడ కాదనే పెద్దవాళ్ళు ఆ ఇంట్లో ఎవరూ లేకపోయినా, అల్లుడేమయినా అనుకుంటాడని కాబోలు.

'తన్ను కూతురిల్లే అయినా చచ్చే మొహమాటంగా వుందిక్కడ. ఇదుగో రేపు అమావాస్య వెళ్లగానే వెళ్ళిపోతా — బాబిగాడికి మళ్లీ జబ్బుచేసింది, అది తగ్గి వాడు కాస్త కలాసాగా ఆడుకుంటూంటే వెళ్ళిపోతా — ఇన్నాళ్ళు వుండి పండగముందు ప్రయాణం ఏమి బాగుంటుంది అమ్మాయి. పండగ వెళ్ళగానే వెళ్ళిపోతాను' అంటూ మధ్య మధ్య ప్రయాణం అయ్యేది.

ఆవిడ అవస్థ గ్రహించిన నిరంజనం, 'మీకిది పరాయిచోటా? మాకు పెద్ద దిక్కుగా ఇక్కడే వుండిపొండి—' అని బలవంతం చేసేసరికి తన ప్రయాణం గొడవ వదిలేసింది.

అన్నయ్యలు దూరం అయినా వాళ్ళ ఉద్యోగాలు బాధ్యతలూ అంటూ సరిపెట్టుకున్నాడు కాని దగ్గరలోనే వుంటున్న అక్కయ్యలుకూడ రావటం తగ్గించేసరికి నిరంజనం మనస్సుకి కష్టం తోచి నిష్ఠూరం వెయ్యబోతే,

'వస్తూంటాంలే. మొన్నేదో వీలు కాలేదు' అంటూ సర్ది చెప్పేవాళ్ళు.

'అమ్మా నాన్నా వున్నన్నాళ్ళే పుట్టిల్లు. అన్నదమ్ముల హయాంలో ఇంకా ఏం వెడతాం అయినా ఏ మాట కా మాటే చెప్పుకోవాలి. అన్నయ్యల పెత్తనం లేక పోయినా, వదినలు అమ్మలా ఆదరించక పోయినా మర్యాదగానే వుంటున్నారు. తమ్ముడి గారింట్లోనే మరి అన్యాయం—మరదలే కదా అని సర్దుకుపోయేందుకు లేదు కదా. పెత్తనం అంతా ఆ ముసలావిడ చేతిలో వుంది. పిల్లలకి మరి కొంచెం అన్నం పెట్టడానికికూడ తన సొమ్మేదో తరిగిపోతున్నట్లు బాధ పడుతుంది. చంటాడి మరో గరిట నెయ్యి వెయ్యమనేసరికి, 'ఊ' అంటూ అత్త గరిటే ఇలా విదుపుతుంది. అవన్నీ చూస్తుంటే మరీ అసహ్యం వేస్తుంది—అందుకే దగ్గరగావున్న తమ్ముడు మరీ దూరం అయిపోయాడు' అని వాళ్ళు అనుకునేమాటలు అప్పుడప్పుడు నిరంజనం చెవుల్లోకూడ పడినా ఏమీ చెయ్యలేక ఓ నిట్టూర్పు విడిచి వూరుకున్నాడు.

(ఇంకా వుంది)

# గోముఖవ్యాఘ్రమా?

గౌహతిలో ఒక ఆవు గడ్డిగాదరా తినడం మానేసి చాపలూ, జెల్లలూ, మాంసమూ తినడం ఆరంభించిందని యీవాళె వద్దానుగున తెలిసింది. ఈ ఆవు పావురాయి మాంసం చాలా ఇష్టంగా తింటోం దట. 'కామాఖ్య' గుడి ప్రాంతంలో తిరుగుతూ



పిం పాటునవున్న పావురాయిలను పట్టుకుని తినేస్తోందట. రోజుకి ఒక అరడజను పావురాళ్లను తింటోందని, ఆవు వంటి పవిత్రమైన శాకాహారి యీవిధంగా పచ్చిమాంసం తినడం చాలా విపరీత మని, విడ్డూరమని, వింత అని, విచారణీయమని వెటరినరీశాస్త్ర నిపుణులు అన్నారు.

## మార్పు-యుద్ధం

కుట్టియాడి (కాలికట్టునుంచి నలభై మైళ్ల దూరం) గ్రామంలో రెండు పక్షాలమధ్య జరిగిన పోట్లాటలో యిద్దరు మరణించారు మరో డజను మందికి తీవ్రంగ గాయాలు తగిలాయి. ఈ పోట్లాటల్లో [illegible] చేతిబాంబులు, ప్రేలుడు సామగ్రీ విరివిగా ఉపయోగించారట. ఓ భూస్వామి తన [illegible] ఎకరాల భూమిని సాగుచేస్తున్న పాతవాడిని మార్పించి మరొకడికి సాగుకి యివ్వబోవడంతో యీ తగాదా ప్రారంభ మయ్యిందట.

## దారుణ మరణం

కాలికట్టులో ఫిరోక్‌నదిని దాటుతుండగ కోయకట్టి అనే కుర్రాడు బోటులోంచి ప్రమాద వశాత్తూ నదిలో పడిపోయాడట. అది చూసి ఆతని తల్లి గమ్మున లటన్ని పట్టుకోబోయేసరికి ఆమె ఒళ్లోనున్న 18 నెలల పసికందు కూడా జారి నదిలో పడిపోయేసరికి, నావ తిరగబడి ఆమె, ఆమె భర్తకూడా నదిలో పడిపోయారట. చివరికి ఆమె, ఆమెభర్త సురక్షితంగా ఒడ్డుకు చేరారట. పిల్లలిద్దరూ చనిపోయారట. [illegible]

## కారణం

సైగాన్‌కు 200 మైళ్ల దూరంలోవున్న ఒక బౌద్ధారామంలో బౌద్ధ భిక్షువైన ఒక స్త్రీ తనమీద పెట్రోలు పోసుకుని ఆత్మార్పణ చేసుకుంది. పవిత్రమైన బౌద్ధారామాలు, ప్రదేశాలూ రాజకీయరంగాలుగ మారడం తన కిష్టం లేదనీ, ప్రెసిడెంట్ 'గుయెన్‌వాన్ థియూ' బౌద్ధారామంలోకి ప్రవేశిస్తున్న వార్త తనకి బాగున్న కలిగించిందనీ, రాసిపెట్టి మరీ యీపని చేసిం దామె

జారీర అనేవూరుకు చెందిన బిమల అనే పద్నాలుగు ఏళ్ల అమ్మాయి రోడ్డు దాటుతుండగ మనోవేగంతో వస్తున్న ఒక బస్సు ఆమెమీదుంచి పోయిందనీ, ఆమె అక్కడే చనిపోయిందనీ తెలిసింది. చావు అనివార్యమని ఆర్యులు అననే అన్నారు ఎటొచ్చి ఘోరమరణం రాకుండా వుండాలంటే ఏం చెయ్యాలో! ఇంట్లో కూర్చుంటేనో— అప్పుడు మాత్రం యిల్లు కప్పు కూలితేనో!

## వాహనయోగం-లేదు

ఆంధ్ర ప్లానింగు ఎండ్ లా మంత్రి శ్రీ నారాయణరెడ్డి హైదరాబాదునుంచి వరంగల్ కారులో వెళుతుండగ జనగామ్ సమీపంలో నో నూటు యాభైమంది కాపి, 'మమ్మల్నందర్నీ కార్లో ఎక్కించుకుని తీసుకెళ్లండి'' అనడిగారట ఒక కార్లో అంతమందిని తీసుకెళ్ళడం అయ్యేపని కాదని చెప్పి 'కాదు పోయ్' అని డ్రయివరుతో అనేసరికి ఆగ్రహంతో విద్యార్థులు రాళ్లేసి కారుని కొట్టారట.

* * *

కుటుంబ నియంత్రణ పథకం మీద నిరుటి కన్నా యీ యేడు అధికంగా ఖర్చు పెట్టాలని లండన్‌లో తీర్మానం జరిగింది. ప్రపంచంలో చాలాదేశాలు యీ మాత్రం అనుకుంటున్నాయి, అంటున్నాయి ఇది హిందూదేశ సమస్యేగాక, ప్రపంచ సమస్య కూడా కదా!



## చావు బతుకులు

టొరెంటోలో ఒక 79 ఏళ్ల వృద్ధురాలు కోమా (మైకం)లో వుండగా కరోనర్ (చనిపోయిన వారిని పరీక్షించి స్వాభావికమైన చావో, లేక హత్యో నిర్ణయించి చనిపోయినట్లు సర్టిఫికేట్టు యిచ్చే అధికారి) వచ్చి ఆమెను పరీక్షించి ''ఈమె చనిపోయింది'' అని సర్టిఫికేట్టు యిచ్చి, ఆమె ముఖంమీద తెల్లగుడ్డ కప్పి వెళ్లిపోయాడట. కర్మకాండ చేసేవాడు వచ్చేలోగ ఆ తెల్లగుడ్డ క్రింది మనిషి కదలడంచూసి, ఆమె కొడుకు



ఆశ్చర్యపోయి టొరెంటో వెస్టర్న్ ఆసుపత్రిలో చేర్పాడనీ, అనేక రోజులు వైద్యంలోనే వుంచి తరువాత తీసుకుని, హాయిగా తన కొడుకు యింటికి వెళ్ళిపోయిందని తెలిసింది.

ఈ నెల ఫిదీ తేదీన రాత్రి [illegible] గంటలకు షిల్లాంగ్ (అస్సాం)లో డిప్యూటీ కమిషనరు కోర్టు భవనంవద్ద 'ఢాం' అని పెద్ద శబ్దం వచ్చిందనీ, దాంతో ఆ ప్రాంగణం కిటికీ అద్దాలు వగైరాలు తుత్తునియలైపోయాయనీ ఆ భవనం ప్రాంతంలో అధిక శక్తిగల బాంబు పేలడంవల్ల యీ విపరీతం జరిగిందనీ, అయితే అదృష్టంవల్ల భవనం కూలిపోలేదనీ 'ఆ శాఖ' వారన్నారు కుక్కతో సహా ఆ శాఖ దర్యాప్తులోకి దిగిపోయింది

అదిగాక, ఆ రోజే షిల్లాంగ్‌లో నలభై సెకన్ల పాటు భూమి కంపించి, ఆ వూరు ప్రజల్ని భయ కంపితులను చేసింది. అంతా యిళ్లు విడిచి బయటకు పారిపోయారట.

## వింతజంతువు ఏమిటి?

రాయగిరి, కుంద్ర (జయపూర్) ప్రాంతాల్లో నరమాంసం తినే ఒక భయంకర జంతువు తిరుగుతున్నట్టు అనుమానం వచ్చింది రాయగిరి ప్రాంతంలో ఒక అనుగురిని, కుంద్ర పోలీసుస్టేషను ప్రాంతంలో యిద్దరిని చంపేసిందిట. ఆ జంతువు [illegible]

హిచ్‌కాక్ హిచ్చుస్ చిత్రాన్ని ఎందుకు తీయ లేదు?

వి. ఏ. నాగేంద్రబోస్, మండపేట.

హాలీవుడ్ కెళ్ళి ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ ఆశ్రమంలో శిష్యరికంచేసి తర్వాత సస్పెన్సు చిత్రం తీస్తాను.

శేతమానుల్లో మీరు కేవలం శేఖర్‌ను కష్టాల్లో ఆదుకోవడానికి సుందరంగా సృష్టించబడ్డారు మీరు కారణ జన్ములా?

యం. శౌరి, చిలకలూరిపేట,

సినిమా జన్మ.

తారలను, వారి యాక్షనునూ ప్రత్యక్షంగా మెచ్చుకునే పెద్దలే తమ పిల్లల్ని సినిమాలో చేర్పించటానికి ఒప్పుకోరు. ఎందుకు?

కె. వి. ఎ. కుమారి, తెనాలి




ఒప్పుకోకపోవడమనేది పాతరోజుల్లో! ఈ రోజుల్లో చాన్సు దొరికితే చాలని తంటాలుపడే పెద్దలు కూడా వున్నారు.

సినిమా పరిశ్రమ ఇంకా అభివృద్ధిలోకి రావాలంటే నాటకాలే ముఖ్యమని నా అభిప్రాయం. కాని ప్రభుత్వం దానికి కృషి చేయుటలేదు ఎందుకని?

నారాయణం, నాగభూషణరావు, విజయనగరం.

సినిమా పరిశ్రమ అభివృద్ధి కావడానికి 'బ్రహ్మానంద చిత్రపురి' నిర్మించారు. ఆంధ్ర చలన చిత్రకారులంతా అక్కడ స్థావరం ఏర్పరుచుకున్న రోజున, నాటకరంగం కూడా మూడు పువ్వులు ఆరుకాయలుగా వర్ధిల్లుతుందనడానికి సందేహంలేదు.




మీరు మా సందేహములకు సమాధానము లిస్తున్నారు. మరి మీ సందేహములకు..?

వి. కె. కుమారి, ఏలూరు.

నా మిత్రులు సమాధాన మిస్తుంటారు.

'దేశం కోసం చస్తే ఏం!' అని అంటాను నేను. మరి మీరేమంటారు?

సూదం సత్య, హైదరాబాదు.

'దేశంకోసం ముందు బతికి తర్వాత చద్దామంటాను' నేను.

పద్మనాభంగారూ! స్త్రీకి సిగ్గే సింగారం అన్నారు కదా? కాని ఈనాటి స్త్రీ సింగారం కోసం సిగ్గును విడిచేసింది. మరిప్పుడేమంటారు?

వై. రామకృష్ణారెడ్డి, గుంటూరు.

సిగ్గు అనే వస్తువు ఆకాశంలోకి ఎగిరిపోయింది. ఈ రోజుల్లో స్త్రీకి సింగారమే బంగారం.

సాధారణంగా హాస్యనటు లెవ్వరూ అందంగా ఆకర్షణీయంగా వుండరు. తెలుగులోనే కాదు, హిందీ, అరవ సినిమాల్లో కూడ అంతే! ఎందుకని?

జి. భాస్కరరావు, ఏలూరు.

అందంగా వుండే హాస్యనటులు కూడా లేకపోలేదు. అందులో నేనొకణ్ణి.

తామరబొడ్డుగారూ! నాకు కూడ మీలాగే ఓ పెద్ద హాస్యనటుడినై పోవాలని ఉంది. ఏమంటారు?

కె. కె. కిషోర్, చీరాల.

'కి'—'షోర్' అంటే తాళం-తీరం గారూ! మీరు పెద్ద హాస్యనటుడయి పోవాలనుకుంటే మిమ్మల్ని ఎవరూ ఆపలేరు—అయిపోండి.

మిమ్మల్ని కేంద్రప్రభుత్వ ఉక్కు కర్మాగారం మంత్రిగా నియమిస్తారనుకోండి. అప్పుడు, అయిదవ ఉక్కు ఫ్యాక్టరీని విశాఖపట్నానికే ఇస్తారా సార్?

యస్. బాలకృష్ణారావు, ఖరగ్‌పూర్.

విశాఖపట్నానికి చస్తే ఇవ్వను—వైజాక్‌కు ఇస్తాను.

అన్ని వారపత్రికలలోను సినిమా స్టార్స్ చేతనే ప్రశ్నలకు సమాధానాలు ఇప్పిస్తారు కాని, ప్రస్తుతం ఉన్న మంత్రుల చేత సమాధానాలు ఎందుకు ఇప్పించరు? అలా సమాధానాలు ఇస్తే ఎలా వుంటుందో చెప్తారా?

జి. చంద్రశేఖరరావు, ఏలూరు.

అడగండే అమ్మైనా పెట్టదు. అడగండి.

సార్! ఆడవారు ఎప్పుడూ మీ అమ్మగారు, మీ కుమార్తెగారు, మీ భార్యగారు, మీ అక్కగారు అంటారేగాని ఒక్కసారైనా మీ నాన్నగారు అనరు. ఎందుకు?

బి. వి. సుబ్రహ్మణ్యశాయి, ఏలూరు.

బ్రదర్! మనం ఇండియాలో వున్నాం—అమెరికాలో కాదు.

తగిలిన కాలుకే తగిలినట్లు కష్టాలు దుఃఖాలు ఎదుర్కొంటూన్న వారికే ఎదురవుతుంటాయి. ఎందుకు?

కె. వి. వేదశ్రీ, విల్లుపురం.

జీవితం రసగుల్ల పాకంలా బాగా పాకంపట్టి పరిపక్వతపొంది— కర్మ పరిపక్వత చెందడానికి అప్పుడే—

జన్మలలో కెల్ల మానవజన్మ ఉత్తమం. దానిలో పురుష జన్మ ఇంకా గొప్పదంటారు. అటువంటి పురుషుడే స్త్రీకి లొంగిపోతాడెందుకు?

జి. రమాదేవి, నెల్లూరు.




స్త్రీ జన్మకూడా ఉత్తమోత్తమమైంది కాబట్టే పురుషుడు లొంగి పోవడంలో ఆశ్చర్యంలేదు.

[illegible] సెన్సారు చేయాలంటే [illegible] రోజులు పడుతుంది.

పోలా మోహనరావు, [illegible]

సెన్సారు అంటే పొలంమీదుంటున్న గడ్డిచెక్కడ మనుకుంటున్నారా? కొన్ని గంటలు మాత్రమే పడుతుంది

పద్మనాభంగారూ! మద్యనిషేధం ఎందుకండీ?

సిలారి వీరరఘువరావ్, ఏలేశ్వరం.

ప్రభుత్వానికి ఆర్థిక నష్టం కలుగడానికి - లేనిపోనివి త్రాగి ప్రజలు చావడానికి.

తల్లిదండ్రులు కుమారుడు పుట్టినప్పుడు సంతోషించినంతగా, కుమార్తె పుట్టినప్పుడు సంతోషించరు. ఎందుకు?

ఎ. వి. సుబ్బారావు, భీమవరం.



వరకట్న వ్యాపారానికి కొడుకు లాభం, కుమార్తె నష్టం. మరి నష్టమంటే కష్టమేగా!

'ఎందుకు?' శీర్షికక మీరిస్తున్న సమాధానాల అంత 'రుచి'గ వుండటం లేదు ఎందుకు?

వై. శ్రీహరిరావు, మండపేట

మీ 'అభిరుచి'ని అడగండి.

కోర్టులో సాక్షులు 'దేవుని మీద ప్రమాణం చేసి నిజం చెప్పుతాను. అబద్ధం చెప్పను' అని ప్రమాణం చేసికూడా అబద్ధపు సాక్ష్యాలిస్తారెందుకు?

ఎం. రామమూర్తి, కరీంనగర్.

అంతా నిజమే చెప్తే కోర్టు లెందుకు? కేసులెందుకు.

[illegible] కూడా [illegible] లేది?

జి. జయలక్ష్మి, మద్రాసు.

బ్రతకడమే భయంకరం.

మనిషిలో నిరాశ ఎప్పుడు, ఎందుకు కల్గుతుంది? అవి మీకు ఎప్పుడు అనుభవంలోకి వచ్చాయి?

బి. నాగమణి, చింద్వారా.

కష్టదశలో వున్నప్పుడు నిరాశ మనిషిని చంపడానికి ప్రయత్నిస్తుంది. అప్పుడు మనోధైర్యాన్ని పెంచుకొని లక్ష్యాన్ని సాధించి జయించాలి. నాకే కాదు ప్రతి వ్యక్తికీ యిది అనుభవంలోకి వచ్చే ఘట్టమే!

వచ్చే పది రూపాయిలలో మీకూ, నాకూ ఫిఫ్టీ ఫిఫ్టీ. ఎలాంటి ప్రశ్నలు బహుమతి యోగ్యమో కాస్త చెప్పరూ?

కె. రంగరెడ్డి, తాడేపల్లి.

ఓహో! యిందులో కూడా పంచాలా! చాలు! చాలు!

మిమ్మల్ని సోఫియాలోరెన్ ప్రక్కన హీరోగా నటించమంటే ..,

ఫయాజ్, మద్రాసు.

ఎత్తు పెరగడానికి నాలుగడుగుల బూట్లు యిప్పుడే కొనుక్కుంటాను.

మనిషి తన తప్పును తాను సాధారణంగా, ఎందుకు ఒప్పుకోలేడండీ?

పి. రామారావు, బిళ్లూరి.



చేతిలో కర్రబట్టి, గుడ్లు మిటకరించి, పండ్లు బిగబట్టి గట్టిగా అరవండి 'తప్పును తప్పకుండా ఒప్పుగా ఒప్పుకుంటాడు.'

## బహుమతిపొందిన ప్రశ్న

'నవ్వు నాలుగు విధముల నష్టము' అని తెలిసికూడా మీరు అంత నవ్వించడానికి ప్రయత్నిస్తారు ఎందుకు?

టి. విజయ్‌కుమార్, బిళ్లూరి.



నేను నవ్విస్తున్నాను కాని నేను నవ్వడంలేదు - అందుకయి నాకు నాలుగు విధాల లాభం. '1. ప్రొడ్యూసర్ల దయ, 2. మీ అందరి అభిమానం, 3. ఎంతో కీర్తి, 4. యింత ధనప్రాప్తి!'

ఏమండోయ్ పద్మనాభంగారూ, ఓ చిన్నసందేహం. మీకు జవాబు తెలియని ప్రశ్నలకు మీరేమి సమాధానం యిస్తారో తెలియజేస్తారా? (చెత్తబుట్టకి, మాత్రం అర్పించరు కదూ!)

జె. శ్యామల, తలపంచి.

తెలియనిదానికి సమాధానం '———'

పద్మనాభం



'రహస్యం'లో కృష్ణకుమారి, నాగేశ్వరరావు

చిత్రసమీక్ష:

# రహస్యం

పాత్ర చుట్టూ కథ తిరిగినా, కథ చుట్టూ పాత్ర తిరిగినా అది ఆ పాత్రధారి ప్రజ్ఞకి ఉపజ్ఞకి గీటురాయిగా వుంటుంది ఇటువంటిదే ముఖ్యపాత్ర అని ఇప్పటివరకూ అనుకొంటూవస్తున్నాం కథ భారాన్ని పలుగురికి పంచిపెట్టినప్పుడు ఏ ఒక్క పాత్రా ప్రజల్లో నిలవదనడంలో అర్థం లేకపోలేదు కథానాయకు డెవరో తెలుసుకోవడానికి ప్రజలు ఇరకాటంలో పడతారు అగ్రశ్రేణి నటుడే కథానాయకుడు, కథాంతంలో చలనచిత్ర విచిత్రాన్ని ఛేదించినవాడే కథానాయకుడు—అని నిర్మాతల పరిభాష చిత్రనిర్మాణంలో మార్పుతేవాలని భారీ ప్రయోగాలు చేస్తున్న నిర్మాతల కృషి ప్రశంసనీయం!

మేటి తారాగణంతో అట్టహాసంగా నిర్మించిన చిత్రం లలితా శివజ్యోతివారి 'రహస్యం' ప్రేక్షకులకి ముందే తెలిసిన రహస్యాన్ని పాత్రలు మధ్యలో గుసగుసలాడతాయి అంతంలో ఒకరు రహస్యం తెలుసుకోలేని అమాయకత్వంలోనే వుండిపోతారు. ఇదే రహస్యం. ఈస్ట్‌మన్ కలర్‌లో అత్యద్భుతంగా నిర్మించిన రహస్యం ప్రేక్షకుల వీనులకి విందు, కన్నులకి పండుగ!

అనగా అనగా ఒక రక్తభీషయోగి అతను జగన్మాత లలితాదేవి భక్తుడు మోక్షంకోసం దేవిని ప్రార్థిస్తాడు గృహస్థాశ్రమం స్వీకరిస్తేనేకాని మోక్షం లభ్యం కాదంటుంది దేవి అతను రవిచంద్రుని రూపంలో రాజ్యలక్ష్మిని పెళ్లిచేసుకుంటాడు శ్రీగండ మహారాజా అతనికి అకారణ శత్రువు మందకుడు తెగింపుగల యువకుడు కరుణాకర మహారాజా కొలువులో అన్యాయాన్ని ఎదుర్కొంటూ ధైర్యసాహసాలతో పోరాడుతూ వుంటాడు శ్రీగండుడు రక్తభీషుడిని పనులు చేస్తూ, మందకుడి నెదుర్కొంటూ చిత్రాన్ని పొడిగించడానికి పాటుపడతాడు మందకుని కార్యదీక్షతో రక్తభీషుడు ఎప్పుడూ రవిచంద్రుడుగానే వుండిపోతాడు రవిచంద్రుడిలో రహస్యం రాజ్యలక్ష్మికి తెలియదు 'తామసరజో గుణాలతో ఏ కార్యాన్నీ సాధించలేము' అన్న నీతిని చివర్లో నాతుడు పాడతాడు. కథ కంచికి.

నిత్య యౌవనుడు నాగేశ్వరరావు కథానాయకుడు మందకుడుగా నాగేశ్వరరావు నటన అతి చాకచక్యంగాను ప్రతిభావంతంగాను వుంది జానపదనాయకుడు కాంతారావు నటనలో రవిచంద్రుని పాత్ర రాణించింది రక్తభీషుడుగా యస్వీరంగారావు పాత్రకి ప్రాణం పోశారు శ్రీగండప్రభువుగా గుమ్మడి వెంకటేశ్వరరావు నటన పాత్రోచితంగావుంది కుమారిగా బి సరోజాదేవి మనోహరంగా నటించింది రాజ్యలక్ష్మిగా కృష్ణకుమారి చిత్రానికి శోభ తెచ్చింది. నారదుడుగా హరనాథ్ సారధ్యం బాగున్నది. పద్మశ్రీ నాగయ్య, రాజనాల, పి. హెచ్. నారాయణరావు, రేలంగి, రమణారెడ్డి, లింగమూర్తి, లంకసత్యం, గోపాలకృష్ణ, వంగర, జి. వరలక్ష్మి, గీతాంజలి, సూర్యకాంతం, గిరిజ, ఝాన్సీ మొదలైన అగ్రశ్రేణి నటీనటులతోపాటు అంజలీదేవి, జయంతి అతిథులుగా కనిపిస్తారు

రంగులు, విలువైన సెట్లు రహస్యానికి హంగులు కళ, అలంకరణ ఒక విశిష్టత. కూచిపూడి యక్షగాన దృశ్యనాటిక ఒక ప్రత్యేకత అందరూ అవశ్యం చూడాల్సిన చిత్రం 'రహస్యం'

బేనర్‌కి సంబంధించిన పాటలన్నీ ఘనంగా వున్నాయి పాటలు, పద్యాలు శ్లోకాలు వెరసి ముప్పయ్యేడు, ఈ ఇరవై రెండింటిల్లో రహస్యంలో వింటాం ఘంటసాల సంగీతం మధురంగావుంది కళ టి వి యస్. శర్మ, కథ ఆర్ సుబ్రహ్మణ్యం అనుసరణ, మాటలు, పద్యాలు సదాశివబ్రహ్మం పాటలు మల్లాది రామకృష్ణశాస్త్రి, సముద్రాల, సదాశివబ్రహ్మం, సి నారాయణరెడ్డి, అద్భుత ఫోటోగ్రఫీ పి యల్ రాయ్. ఎడిటింగ్ ఆర్ యం వేణు

వేదాంతం రాఘవయ్య దర్శకత్వం వహించిన ఈ చిత్రానికి నిర్మాత ఎ శంకరరెడ్డి. వాణీ రిలీజ్.

—సికరాజు ●

## పేకేటి శివరాం దర్శకత్వంలో కన్నడ చిత్రం 'చక్రతీర్థ'

'కొన్ని దశాబ్దాలుగా నేను తెలుగు చిత్రపరిశ్రమలో పనిచేస్తున్నాను. నేనీరోజున స్వతంత్రంగా ఒక కన్నడ చిత్రానికి దర్శకత్వం వహించగలిగానూ అంటే అది తోటి కళాకారుల ప్రోత్సాహమే. వారికి నా కృషిని చూపించి ఆశీస్సుల నందుకుందామని ఈ కార్యక్రమాన్ని ఏర్పాటుచేశాను'. అన్నాడు ఆ చిత్రదర్శకుడు పేకేటి శివరాం. నవ్ థియేటర్‌లో 'చక్రతీర్థ' కన్నడ చిత్రాన్ని చూపిస్తున్నప్పుడు.

ఒక తెలుగు నటుడు కన్నడ చిత్రానికి దర్శకత్వం వహించి మొత్తం ముప్ఫయ్ రోజుల్లో చిత్రాన్ని పూర్తిచేయడం సాధారణ విషయంకాదు. 'నటీనటులు, టెక్నీషియన్లు కష్టనష్టాలకోర్చి 'టీమ్ వర్క్' చేయడం వల్లనే నెలరోజుల్లో చిత్రనిర్మాణం పూర్తయింద'ని ఆయన అన్నారు. తెలుగు చిత్రాలకిది మార్గదర్శకం కావొచ్చు!

భగవతీ ప్రొడక్షన్స్ వారి 'చక్రతీర్థ' నిర్మాత యస్ యస్. పాల్ బెంగాలీ యువకుడు. సంగీతం : టి జి లింగప్ప. కెమెరా. చిట్టిబాబు. కథ : 'తారాసు.'

దర్శకుని ప్రతిభ అడుగడుగునా చూపగల ఈ చిత్రంలో ఉదయకుమార్, రాజ్ కుమార్, బాలక్రిష్ణ, డా. శేషగిరిరావు, డి ఎం వెంకటేశ్, జయశ్రీ, శాంతలాదేవి నటించారు.

జయంతి ముఖ్యభూమికని పోషించి డ్యూయెల్‌రోల్‌ని సామర్థ్యంతో చక్కగా నిర్వహించింది

### సుఖదుఃఖాలు

విజయభట్ మూవీస్ వారి సుఖదుఃఖాలు ఈ నెలాఖరుకి పూర్తయి డిశంబర్ 15 వ తారీకున విడుదల చేయటానికి సన్నాహాలు చేస్తున్నట్లు ఆ చిత్రనిర్మాతలలో ఒకరైన శ్రీ పి. ఏకామ్రేశ్వరరావు అన్నారు.

ఈ చిత్రంలో ఎస్. వి. రంగారావు ఒక సరికొత్త పంథాలో పాత్రపోషణ చేశారు.

ఈ చిత్రానికి దర్శకుడు ఐ. ఎన్. మూర్తి, ఛాయాగ్రహణం : కన్నప్ప; సంగీతం : కోదండపాణి, నిర్వహణ : రాఘవ్, సహనిర్మాత : హెచ్. వి. సుందర్, నిర్మాతలు : పి. ఏకామ్రేశ్వరరావు, ఎన్. ఎస్. భట్.

# సినిమా

## విదేశీయులు ఆశ్చర్యపడాలి

'ఐ యామ్ బిజీలీ ఎన్‌గేజ్‌డ్ అన్‌టిల్ 1968' అన్నారు దర్శకులు శ్రీ పి ఎస్ రావు వీనస్ స్టుడియోలో శ్రీకాంత్ ప్రొడక్షన్స్ షూటింగు జరుగుతున్న సందర్భంలో 'అంటే' అని అడగడంతో 'ఏమని చెప్పమంటారు? తొమ్మిది పిక్చర్స్‌ను పూర్తి చేసిపెట్టాలి ఇవిగాక శ్రీదేవివాళ్ళు తీయనున్న జానపదాన్ని 'డైరెక్టు' చెయ్య



'సుఖదుఃఖాలు'లో వాణిశ్రీ.

మంటున్నారు. ఇందులో శ్రీ రామారావు నాయకుడు. మరి ఒకప్రక్క శ్రీ విశ్వేశ్వర రావు 'యువ ఆర్ట్ ఎంటర్ ప్రయిసస్'కు 'వైజాగ్—టు—హైద్రాబాదు' చిత్రాన్ని తీసిపెట్టాలని అడుగుతున్నారు. దీని షూటింగు జనవరినుండి ప్రారంభమవుతుంది. ఇది సంపూర్ణ హాస్యచిత్రం ఇందులో ఒక బస్సు నాయకుడు. ముఖ్య భూమికలను శోభన్, జయలలితలు వెయ్యొచ్చు మధ్యలో రవీంద్రాకు డిసెంబరు ఆఖరు నుండి ప్రతివెలా డేట్స్ యిచ్చాను. ఎలా 'అడ్జస్టు' చెయ్యడమా అని బోధపడడం లేదండి' అన్నారు. 'మరి వివా ఇంగ్లీషు



'అసాధ్యుడు'లో కృష్ణ, కె. ఆర్. విజయ.

పిక్చర్ ఏమయింది?' అన్నాను

'ఇట్ విల్ బి ప్రొడ్యూస్‌డ్', 'ఒట్' వాకు, శ్రీ ఎన్ టి ఆర్ కు ఖాళీ దొరకాలి మన రామారావులోని 'ట్యాలెంట్'ను విదేశీయులు చూచి ఆశ్చర్యపడాలి అంత మంచి సబ్జక్టు నాదగ్గరవుంది' అన్నారు

'రవీంద్రా ఆర్ట్సులో కుమారి జయలలిత కాల్‌షీట్లు కాని 'క్లాష్' అయినందున్న యిప్పుడు ఆమెకు బదులు వాణిశ్రీని పెట్టుకున్నాం' అన్నారు.

* * *

# సినిమా డైరీ

● శ్రీదేవి కంబైన్స్‌వారు నిర్మించిన "పెద్దక్కయ్య" సాంఘిక చిత్రం నవంబర్ 17న మద్రాసులోని 'క్రౌన్ థియేటర్'లో, 18న ఆంధ్ర అంతటా విడుదలయింది

● మహిజా పిక్చర్స్‌వారి పౌరాణికం 'వీరాంజనేయ' చిత్రంలో వరదపాత్రకు శోభన్‌బాబును ఎన్నుకున్నారు

● సెషన్స్ కోర్టు తీర్పును ఎదిరిస్తూ శ్రీ ఎం ఆర్ రాధా హైకోర్టుకి అప్పీల్ చేశారు శ్రీ రాధా తరపు వకీళ్ళు 284 కారణాలు చూపిస్తూ ఆయనను విడుదల చెయ్యాలని కోరారు శ్రీ రాధా తరఫున శ్రీయుతులు మోహన కుమారమంగళం, వాసమామత్తై, నటరాజన్‌లు అప్పీల్ దాఖలు చేశారు హైకోర్టు న్యాయమూర్తి నవంబర్ 15వ తేదీన శ్రీ రాధను జామీనుపై విడుదల చేస్తూ ఆయన తిరుచ్చిలోనే ఉండాల్సి ఉంటుందని వెల్లడించారు ఈ కేసుపై పునర్విచారణ హైకోర్టులో జరుగుతుంది

● సుభాషిణీ ఆర్ట్స్‌వారి "ఆడపడుచు" నవంబర్ 30వ తేదీన పూర్ణాపిక్చర్స్ ద్వార ఆంధ్రలో విడుదలవుతుంది

● శ్రీ తమ్మారెడ్డి కృష్ణమూర్తి నిర్మించే సాంఘిక చిత్రానికి శ్రీ పి ఎస్ రావు దర్శకత్వం వహిస్తారు సంగీత సారథ్యం శ్రీ చలపతిరావు నెరపుతారు వీరిద్దరి కాంబినేషన్‌లో తయారయే మొదటి రంగుల చిత్రం యిదే

● పద్మశ్రీ పిక్చర్స్ "వింత కాపురం" చిత్రానికి సంగీత దర్శకుడుగా శ్రీ వేణుని నియమించారు

● నిర్మాత శ్రీ హరగోవింద్ నిర్మించే హిందీ చిత్రానికి దర్శకుడుగా శ్రీ ఆదుర్తి సుబ్బారావు నియమించబడ్డారు

● ఎ వి ఎం వారి 'రాము' తమిళంలో కె ఆర్ విజయ పోషించిన పాత్రని తెలుగులో జమున నిర్వహిస్తుంది

● సురేష్ పతాకం క్రింద నిర్మాత శ్రీ రామానాయుడు ఒక జానపద చిత్రాన్ని శ్రీ కె ఎస్ ప్రకాశరావు దర్శకత్వంలో జనవరిలో ప్రారంభించడానికి సన్నాహాలు చేస్తున్నారు నాయికానాయకులుగా కృష్ణకుమారి, ఎన్ టి రామారావు నటిస్తారు.

● డి వి ఎస్ ప్రొడక్షన్స్ వారు నిర్మిస్తున్న "తిక్కశంకరయ్య" చిత్రంలో ఎన్ టి రామారావు ద్విపాత్రాభినయం చేస్తున్నారు కృష్ణకుమారి, జయలలితలు నాయికలుగ నటిస్తున్నారు

## సినిమా

'మార్చి నుండి క్షేత్రయ్య'ను మొదలు పెడ్తాం' అన్నారు అంజలీదేవి. 'బాగున్నారా!' అని అడిగాను. 'ఏమోనండీ, యీ కాలంలో మంచితనం పనికిరావడం లేదు. అనుకోకుండా అనవసరమయిన, మనకు సంబంధం లేని చిక్కుల్లో పడ్తాం. కానీ నిజం నిలకడమీద తెలియక పోతుందా!' అని నిట్టూర్చారు.

### కళాకారుల సహకారం

వీనస్ నుండి 'వాహిని'కి వెళ్ళాను. పోవడంలోనే రికార్డింగ్ థియేటరు వద్ద శ్రీ హేమాంబరధరరావు 'రండి, రండి', అని లోపలికి పిలిచారు. వారి 'ఆడపడుచు' రీ—రికార్డింగ్ జరుగుతూ వుంది. రెండు, మూడు సీన్లు చూపించారు. పిక్చర్‌లో మంచి క్వాలిటీ కన్పడింది. 'పిక్చర్‌ని యీ నెల 30న రిలీజ్ చేస్తున్నాను. ఇంత త్వరగా నా చిత్రం పూర్తయేందుకు మా ఆర్టిస్టులందరూ సహకరించారు'...

ఎన్. టి. ఆర్. ఎక్సెల్స్ ఇన్ 'ఆడపడుచు'. శ్రీ రామారావు పౌరాణిక, జానపద, చరిత్రాత్మక చిత్రాల్లోనే కాదు, సాంఘికాల్లో కూడ వున్నతంగా నటించిన పాత్రలు యెన్నో వున్నాయి. వాటన్నింటి కన్నా 'ఆడపడుచు'లో వారి 'యాక్టింగ్' భలేగా వుంది. నటుడిగా యిది వారికి ఒక 'హేట్ ట్రిక్.'

### ప్రస్తుతం పెళ్లి ప్రసక్తి లేదు!

'నో క్వొశ్చన్ అఫ్ మ్యారేజి' అన్నది రాజశ్రీ 'రణబేరి' సెట్టులో. 'అంటే మీరు శాశ్వతంగా పెళ్లి మానేస్తారా?' అన్నాను. 'నో, నో, నో! అది కాదండి. ఇప్పుడు నాకేమి వయస్సు అయిపోయిందని. ఇంకా కొన్ని యేళ్లు యీ కళా రంగంలో మంచి, మంచి పాత్రలను పోషించి, ఆ తర్వాత 'ఒన్స్ ఫర్ ఆల్' జీవిత భాగస్వామితో సంసారం చెయ్యదల్చుకున్నాను. అంతవరకు ఆ ప్రసక్తే లేదు.' అన్నది

'మరి మీ 'ఫిలిం మార్కెట్టు' ఎలా వుంది?' అన్నా. 'దివ్యంగా వుంది. ఇటు తెలుగు, అటు తమిళం గాక హిందీ, మళయాళం, కన్నడం నిర్మాతలు కూడ 'బుక్' చేస్తున్నారు. ఏదో మీ అందరి సహకారం, భగవంతుడి దయవల్ల బాగానే వున్నామండి' అన్నారు. ఇంతలో 'షాట్ — రెడీ' అనడంతో రాజశ్రీ షూటింగులో పాల్గొనేందుకు వెళ్ళారు.

### సంతోషం సగం బలం

దగ్గర్లోనే కృష్ణకుమారి కారు కన్పించింది. రాజశ్రీ దగ్గర్నుండి ఆమె దగ్గరకు వెళ్ళాను. అప్పుడే డి. వి ఎస్. ప్రొడక్షన్స్ షూటింగు ముగించుకుని 'మేకప్' తీసేందుకు ఎ. సి రూమ్‌కు వెళ్తూ లోపలికి ఆహ్వానించింది. 'దిస్ ఇయర్ ఈజ్ ది లక్కీయస్ట్ యియర్ ఫార్ మీ' అన్నది సగర్వంగా. 'ఏమిటీ?' అన్నా. 'చూడండి. 'స్త్రీ జన్మ'లో, నా యాక్టింగ్‌ను పొగుడూ, నా ప్రేక్షకులు వ్రాసే ఉత్త

లొన్ని చదువుతూ వుంటే నా ఆనందానికి హద్దు కన్పించడం లేదు నా మనస్సు సంతోషంతో వుప్పొంగి పోతుంది నాకు యిది నిజంగా మూడవ మరపురాని అధ్యాయం,' అన్నది 'మూడో అధ్యాయమా?' 'ఆ! అవును' శ్రీ ఎల్ వి ప్రసాద్‌గారి 'ఇల వేలుపు' చిత్రం మొదటి మరపురాని ఘట్టం అయితే, పి ఎ సి వారి 'భార్యాభర్తలు' చిత్రం నా రెండవ మరువ లేని ఘట్టం ఇప్పుడు 'స్త్రీజన్మ'లో నాకు లభించిన 'పేరు' నాకు తనివితీరని ఆనం దానుభూతిని కల్గించిందండి ఇదిగాక యీ యేడు విడుదలయిన చిత్రాల్లో మూడొంతుల పైభాగం 'నేనే' వున్నాను నేను నటి స్తున్న పాత్రలు కూడా ప్రేక్షకుల సాను భూతిని పొందేవిగానే వున్నాయి!' అందామె

'మీరేమిటండి, ఏదయినా 'మూలిక'ను తింటారా? లేకపోతే మీ శరీరం యెప్పుడూ చూచినా ఒకే మాదిరిగా గ్లామరస్‌గానే వుంటుందే' అన్నా దానికి ఆమె నవ్వి 'అదంతా యేమీలేదండి? సంతోషం సగం బలం అన్నారుగదా పెద్దలు నేను నా పనేమో నేను మానూ, నా వృత్తికి న్యాయం చేస్తున్నాను నిర్మా తలు, దర్శకులు అందరూ నన్ను అభిమాని స్తున్నారు పాత్రికేయులు తగిన ప్రోత్సా హాన్ని యిస్తున్నారు ప్రేక్షకులు సర్వదా తమ ఆశీస్సులను చల్లుతున్నారు ఇంత ఆనందం నాకు కల్గేప్పుడు దానికి మించి 'మూలిక' యేం చెయ్యగలదండి అన్నది ఛలోక్తిగా.

* * *

'సరే' అని ఆమెకు 'గుడ్‌బై' చెప్పి విజయ స్టుడియో వైపు వెళ్ళా అక్కడ ఏడో ఫ్లోర్‌లో ప్రమోద్ ఫిలింస్ షూటింగు (హిందీ) జరుగుతూ వుంటే, తొంగిచూశా మన తెలుగుతార జయంతి 'రండి రండి' అని లోపలికి తీసికెళ్ళింది అది ఒక దేవా లయం సెట్టు ఆ సెట్టులో షమ్మీ కపూర్, జయంతి పాల్గొన్నారు ఇందులో జయంతి షమ్మీకపూర్‌కు 'చెల్లెలి'గా నటి స్తోంది కుమారి సవితా నాయిక శ్రీ ప్రమోద్ చక్రవర్తి నిర్మిస్తూ దర్శకత్వం కూడ నిర్వహిస్తున్న యీ చిత్రం యొక్క ఒక షెడ్యూలు మద్రాసులోనూ మరియొక షెడ్యూలు 'బొంబాయి'లోను జరుపు



'పూలరంగడు'లో చలం విజయనిర్మల.

తున్నాం అన్నారు ఇంతలో 'షమ్మీ కపూర్'కు నన్ను శ్రీ పేకేటి పరిచయం చేసారు 'వెరిగ్లాడ్ టు మీట్‌యూ' అన్నాడు షమ్మీ 'హవ్ డు యు డు' అంటూ మీ ఇంటర్వ్యూ 'కావా'లన్నాను 'ఐయామ్ సారీ!' యీరోజుతో షూటింగు అయిపోతుంది నేను బొంబాయి వెళ్తున్నా. 'ఎక్స్‌క్యూజ్ మీ' అన్నాడు

* * *

'నేను రెండు కన్నడం చిత్రాలను డైరెక్టు 'చేస్తున్నా' అన్నారు పేకేటి శివరాం ఇటీవలనే 'చక్రతీర్థ' కన్నడ చిత్రాన్ని డైరెక్టుచేసి ప్రజల, పాత్రికేయుల ప్రశంసల నందుకున్నారు 'కలెక్షన్స్' కూడ 'స్టడీ'గానే వున్నాయి అన్నారు 'ఇదే 'సబ్జె క్టు' తెలుగులో జనవరినుండి తీస్తామను కుంటున్నా'అన్నా రాయన ఇంతలో జయంతి అక్కడికి వచ్చింది 'ఏమండీ వెరి బిజీయా!' అన్నాను 'ఎస్ సార్ నాల్గు హిందీ పిక్చ ర్లల్లో మంచివేషాలు వేస్తున్నాను కన్న డంలో సరేసరి ఇవిగాక రెండు తమిళం, రెండు తెలుగు చిత్రాల్లో పనిచేస్తున్నాను. నేటి నా యీ స్థితికి మావారే, కారకులు' అని పేకేటిని చూపించింది

బ్రహ్మాండమైన హిట్

నేరుగా విజయాధినేత శ్రీ బి నాగిరెడ్డి గార్ని కలిశాను 'మీ 'రాం ఔర్ శ్యాం' ఎలాపోతూంది?' అని అడిగాను 'ఇప్పుడే వస్తున్నా నాయనా! బొంబాయినుంచి. పిక్చర్ బ్రహ్మాండమయిన హిట్' అన్నారు.



'పెద్దఅక్కయ్య'లో వాణిశ్రీ. కృష్ణకుమారి.



ఇటీవల హైదరాబాదులో కుమారి యడవల్లి రమ నృత్యప్రదర్శనసందర్భంలో జస్టిస్ వెంకటేశంగారు కుమారి రమ, అధ్యక్షులు శ్రీమతి సరోజినీ పాండురంగ్

# సినిషా

కొన్నికోట్ల రూపాయలకు అధిపతుడయినా, కాస్త అయినా గర్వం వారిలో లేకపోవడం చూసి ఆశ్చర్య చకితుణ్ణి అయ్యాను.

### రెండు కళ్లు

'నాగిరెడ్డి, రామారావుగార్లు నా కళ్లు' అన్నారు సురేష్ రామానాయుడు. 'అంటే మీ అర్థం!' అన్నా! 'ఈ యిద్దరి సహకారం లేనిదే, ప్రోత్సాహం లేనిదే నేను యే ప్రాజెక్టును ప్రారంభించను. నాకు వారిద్దరూ రెండు నేత్రాల్లాగా సర్వదా నాతో వుంటూ వుంటారు. అందుకే నా చిత్రాలన్నీ విజయవంతమైనాయి' అంటూ తను 'పాపకోసం' సెట్టులోకి డైరెక్టు చేసారు.

అది సి. ఐ. డి. ఛేంబర్ సెట్టులో కుమారి దేవిక, త్యాగరాజు, సత్యనారాయణ, రామదాసు, ప్రభాకరరెడ్డి, పాప పాల్గొన్నారు. శ్రీ ప్రభాకరరెడ్డి సి. ఐ. డి. ఆఫీసరుగా తగిన హుందాను ప్రదర్శిస్తూ, కుమారి దేవిక వద్ద యేదో విషయాన్ని రాబట్టేందుకు ప్రయత్నిస్తున్నాడు. ఈ సన్నివేశాన్ని యువదర్శకులు శ్రీ బి. వి. ఆర్. శేషగిరిరావు అతి సహజంగా చిత్రించారు.

* * *

శ్రీ శేషగిరిరావు పరిశ్రమలోని అన్ని శాఖల్లో మంచి అనుభవాన్ని గడించిన యువకుడు. సురేష్ సంస్థలో ప్రారంభం నుండి వుంటూ వున్నారు. శ్రీ నాయుడు, శేషగిరిరావుకు యింత చక్కటి అవకాశం కల్గించి, వెండితెరకు మరి యొక యువ కళాకారుణ్ణి పరిచయం చేస్తున్నందుకు అభినందిస్తున్నాం. 'పాపంకోసం'లో శ్రీ పెండ్యాల నాగేశ్వరరావు పసందయిన సంగీతాన్ని వినిపించారు. శ్రీ ఆత్రేయ సంభాషణలను వ్రాసారు.

### దోవలో పడ్డాడు

'వాహిని' నుండి సరాసరి పి. ఎ. పి. సుబ్బారావు ఆఫీసుకేసి వెళ్ళాను. అక్కడ వారు సాదరంగా ఆహ్వానించి, తమ చిత్ర విశేషాల్ని ముచ్చటించారు. 'బ్రహ్మచారి ఏమయ్యాడు!' అన్నాను. 'వచ్చేస్తున్నాడు, దోవలో పడ్డాడు' అన్నారు శ్రీ సుబ్బారావు. ఇంక ఒక షెడ్యూలు పని అయిపోతే చిత్రం పూర్తయినట్లే అన్నాడు నవ్వుతూ. చక్కటి కుటుంబ చిత్రాలను నిర్మించే శ్రీ పి. ఎ. పి. సుబ్బారావు సర్వవేళలా సంతోషంగా వుంటూ, చిరునవ్వు లొలికే ముఖంతో సాక్షాత్కరిస్తూ, అతిధులను ఘనంగా సత్కరిస్తూ, 'మంచి వారు'గా పేరెన్నికగన్న వ్యక్తులు. వీరి 'బ్రహ్మచారి' చిత్రం హైదరాబాదు సారథి స్టుడియోలో తయారౌతుంది. శ్రీ అక్కినేని, జయలలిత, ప్రభాకరరెడ్డి, నాగభూషణం, చలం, సూర్యకాంతం, రమాప్రభ, రాజ్‌బాబు ముఖ్యపాత్రధారులు. శ్రీ భమిడిపాటి రాధాకృష్ణ సంభాషణలు రాశారు. శ్రీ తాతినేని చలపతిరావు సంగీత సారధులు. శ్రీ తాతినేని రామారావు దర్శకులు.

—శ్రీనివాస్


**Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.**

# సినిమా



'అపాధ్యుడు'లో కృష్ణ, కె ఆర్ విజయ

## విదేశీయులు ఆశ్చర్యపడాలి

'ఐ యామ్ బిజీలీ ఎన్‌గేజ్‌డ్ అప్‌టు 1968' అన్నారు దర్శకులు శ్రీ పి ఎస్ రావు వీనస్ స్టూడియోలో శ్రీ కాంత్ ప్రొడక్షన్స్ షూటింగు జరుగుతున్న సందర్భంలో 'అంటే' అని అడగడంతో 'ఏమని చెప్పమంటారు? తొమ్మిది పిక్చర్సును పూర్తి చేసి పెట్టాలి ఇవిగాక శ్రీదేవివాళ్లు తీయమన్న జానపదాన్ని 'డైరెక్టు' చెయ్యమంటున్నారు ఇందులో శ్రీ రామారావు నాయకుడు మరి ఒకప్రక్క శ్రీ విశ్వేశ్వరరావు 'యువ ఆర్ట్సు ఎంటర్‌ప్రయిసెస్'కు 'వైజాగ్—టు—హైద్రాబాదు' చిత్రాన్ని తీసిపెట్టాలని అడుగుతున్నారు దీని షూటింగు జనవరినుండి ప్రారంభమవుతుంది ఇది సంపూర్ణ హాస్యచిత్రం ఇందులో ఒక బస్సు నాయకుడు ముఖ్య భూమికలను శోభన్, జయలలితలు వెయ్యొచ్చు మధ్యలో రవీంద్రాకు డిసెంబరు ఆఖరు నుండి ప్రతినెలా డేట్స్ యిచ్చాను ఎలా 'అడ్జస్ట్' చెయ్యడమా అని బోధపడడం లేదండి' అన్నారు 'మరి వీరా ఇంగ్లీషు పిక్చర్ ఏమయింది?' అన్నాను



'సుఖదుఃఖాలు'లో వాణిశ్రీ

'ఇట్ విల్ బి ప్రొడ్యూస్‌డ్', 'ఒట్'నాకు, శ్రీ ఎన్ టి ఆర్ కు ఖాళీ దొరకాలి మన రామారావులోని 'ట్యాలెంట్'ను విదేశీయులు చూచి ఆశ్చర్యపడాలి అంత మంచి సబ్జక్టు నాదగ్గరవుంది' అన్నారు 'రవీంద్రా ఆర్ట్సు'లో కుమారి జయలలిత కాల్‌షీట్లు కాస్త 'క్లాష్' అయినందున్న యిప్పుడు ఆమెకు బదులు వాణిశ్రీని పెట్టుకున్నాం' అన్నారు.

* * *

## సినిమా డైరీ

● శ్రీదేవి కంబైన్స్‌వారు నిర్మించిన "పెద్దక్కయ్య" సాంఘిక చిత్రం నవంబర్ 17న మద్రాసులోని 'క్రౌన్' థియేటర్‌లో, 18న ఆంధ్ర అంతటా విడుదలయింది

● మహీజా పిక్చర్స్‌వారి పౌరాణికం 'వీరాంజనేయ' చిత్రంలో వరదపాత్రకు శోభన్‌బాబును ఎన్నుకున్నారు

● సెషన్స్ కోర్టు తీర్పును ఎదిరిస్తూ శ్రీ ఎం ఆర్ రాధా హైకోర్టుకి అప్పీల్ చేశారు శ్రీ రాధా తరపు వకీళ్లు 284 కారణాలు చూపిస్తూ ఆయునను విడుదల చెయ్యాలని కోరారు శ్రీ రాధా తరఫున శ్రీయుతులు మోహన కుమారమంగళం, వానమామలై, నటరాజన్‌లు అప్పీల్ దాఖలు చేశారు హైకోర్టు న్యాయమూర్తి నవంబర్ 15న తేదీన శ్రీ రాధను జామీనుపై విడుదల చేస్తూ ఆయన తిరుచ్చిలోనే ఉండాల్సి ఉంటుందని వెల్లడించారు ఈ కేసుపై పునర్విచారణ హైకోర్టులో జరుగుతుంది

● సుభాషిణి ఆర్ట్స్‌వారి "ఆడపడుచు" నవంబర్ 30వ తేదీన పూర్ణాపిక్చర్స్ ద్వారా ఆంధ్రలో విడుదలవుతుంది

● శ్రీ తమ్మారెడ్డి కృష్ణమూర్తి నిర్మించే సాంఘిక చిత్రానికి శ్రీ పి ఎస్ రావు దర్శకత్వం వహిస్తారు సంగీత సారధ్యం శ్రీ చలపతిరావు నెరపుతారు వీరిద్దరి కాంబినేషన్‌తో తయారయే మొదటి తెలుగు చిత్రం యిదే

● పద్మశ్రీ పిక్చర్స్ "వింత కాపురం" చిత్రానికి సంగీత దర్శకుడుగా శ్రీ వేణుని నియమించారు

● నిర్మాత శ్రీ హరిగోవింద్ నిర్మించే హిందీ చిత్రానికి దర్శకుడుగా శ్రీ ఆదుర్తి సుబ్బారావు నియమింపబడ్డారు

● ఎ వి ఎం వారి 'రాము' తమిళంలో కె ఆర్ విజయ పోషించిన పాత్రని తెలుగులో జమున నిర్వహిస్తుంది

● సురేష్ పతాకం క్రింద నిర్మాత శ్రీ రామానాయుడు ఒక జానపద చిత్రాన్ని శ్రీ కె ఎస్ ప్రకాశరావు దర్శకత్వంలో జనవరిలో ప్రారంభించడానికి సన్నాహాలు చేస్తున్నారు నాయికానాయకులుగా కృష్ణకుమారి, ఎన్ టి రామారావు నటిస్తారు

● డి వి ఎస్ ప్రొడక్షన్స్ వారు నిర్మిస్తున్న "తిక్క శంకరయ్య" చిత్రంలో ఎన్ టి రామారావు ద్విపాత్రాభినయం చేస్తున్నారు కృష్ణకుమారి, జయలలితలు నాయికలుగ నటిస్తున్నారు

'మార్చి నుండి క్షేత్రయ్య'ను మొదలు పెడ్తాం' అన్నారు అంజలీదేవి. 'బాగు న్నారా!' అని అడిగాను. 'ఏమోనండీ, యీ కాలంలో మంచితనం పనికిరావడం లేదు. అనుకోకుండా అనవసరమయిన, మనకు సంబంధం లేని చిక్కుల్లో పడ్తాం. కానీ నిజం నిలకడమీద తెలియక పోతుందా!' అని నిట్టూర్చారు.

### కళాకారుల సహకారం

వీనస్ నుండి 'వాహిని'కి వెళ్ళాను. పోవ డంతోనే రికార్డింగ్ థియేటరు వద్ద శ్రీ హేమాంబరధరరావు 'రండి, రండి', అని లోపలికి పిలిచారు. వారి 'ఆడపడుచు' రీ—రికార్డింగ్ జరుగుతూ వుంది. రెండు, మూడు సీన్లు చూపించారు. పిక్చర్‌లో మంచి క్వాలిటీ కన్పడింది. 'పిక్చర్‌ని యీ నెల 30న రిలీజ్ చేస్తున్నాను. ఇంత త్వరగా నా చిత్రం పూర్తయేందుకు మా ఆర్టిస్టులందరూ సహకరించారు'...

ఎన్. టి ఆర్. ఎక్సెల్స్ ఇన్ 'ఆడ పడుచు'. శ్రీ రామారావు పౌరాణిక, జానపద, చరిత్రాత్మక చిత్రాల్లోనే కాదు, సాంఘికాల్లో కూడ వున్నతంగా నటించిన పాత్రలు యెన్నో వున్నాయి. వాటన్నింటి కన్నా 'ఆడపడుచు'లో వారి 'యాక్టింగ్' భలేగా వుంది. నటుడిగా యిది వారికి ఒక 'హేట్ టిక్.'

### ప్రస్తుతం పెళ్లి ప్రసక్తి లేదు!

'నో కొశ్చన్ అఫ్ మ్యారేజి' అన్నది రాజశ్రీ 'రణభేరి' సెట్టులో. 'అంటే మీరు శాశ్వతంగా పెళ్లి మానేస్తారా?' అన్నాను. 'నో, నో, నో! అది కాదండీ. ఇప్పుడు నాకేమి వయస్సు అయిపోయిందని. ఇంకా కొన్ని యేళ్లు యీ కళా రంగంలో మంచి, మంచి పాత్రలను పోషించి, ఆ తర్వాత 'ఒన్స్ ఫర్ ఆల్' జీవిత భాగ స్వామితో సంసారం చెయ్యదల్చుకున్నాను. అంతవరకు ఆ ప్రసక్తే లేదు.' అన్నది

'మరి మీ 'ఫిలిం మార్కెట్టు' ఎలా వుంది?' అన్నా. 'దివ్యంగా వుంది. ఇటు తెలుగు, అటు తమిళం గాక హింది, మళయాళం, కన్నడం నిర్మాతలు కూడ 'బుక్' చేస్తున్నారు ఏదో మీ అందరి సహకారం, భగవంతుడి దయవల్ల బాగానే వున్నామండి' అన్నారు. ఇంతలో 'షాట్ — రెడీ' అనడంతో రాజశ్రీ షూటింగులో పాల్గొనేందుకు వెళ్ళారు.

### సంతోషం సగం బలం

దగ్గర్లోనే కృష్ణకుమారి కారు కన్పించింది. రాజశ్రీ దగ్గర్నుండి ఆమె దగ్గరకు వెళ్ళాను. అప్పుడే డి. వి ఎస్. ప్రొడక్షన్స్ షూటింగు ముగించుకుని 'మేకప్' తీసేందుకు ఏ. సి రూమ్‌కు వెళ్తూ లోపలికి ఆహ్వానించింది 'దిస్ ఇయర్ ఈజ్ ది లక్కీయస్ట్ యియర్ ఫర్ మీ' అన్నది సగర్వంగా. 'ఏమిటీ?' అన్నా. 'చూడండీ. 'స్త్రీజన్మ'లో, నా యాక్టింగ్‌ను పొగుడూ నా ప్రేక్షకులు వ్రాసే ఉత్త

# వాటర్‌బరీస్ కాంపౌండ్

## ఉపశమనముతో సహా రోగనిరోధక శక్తిని కలిగిస్తుంది!

ఎత్తి లేబిలు

దగ్గు, జలుబులతో నీర్సముగా ఉండి రోగనిరోధక శక్తిని కోల్పోతారు. అటువంటప్పుడు మీకు యితర వ్యాధులు సోకే అవకాశముంది.

వాటర్‌బరీస్ కాంపౌండులో గల ఓషధులు ఆకలిని వృద్ధి చేస్తాయి, కోల్పోయిన శక్తిని తిరిగి చేకూరుస్తాయి, ఇతర వ్యాధులు కలగకుండా రోగనిరోధక శక్తిని యిస్తాయి. దీనిలో చేర్చబడిన 'క్రియొసోట్' మరియు 'గయొకోల్' దగ్గు, జలుబుల నుండి ఉపశమనమును కలిగిస్తాయి.

**బలము మరియు ఆరోగ్యమునకు వాటర్‌బరీస్ కాంపౌండ్ త్రాగండి!**







వార్నర్-హిందూస్తాన్ లిమిటెడ్